# శరత్

# కాశీనాథ్

అనువాదం :

శ్రీ రామకృష్ణ

విజయ సారధి పబ్లికేషన్స్,

విజయవాడ-2.

# 1

తెల్లవారకముందు నాలుగ్గంటలకే నిద్రలేచి, కాల కృత్యాలు తీర్చుకొని, స్నానం జపతపాలు వగైరా ముగించి, పిలక ముడివేసుకొని, కాశీనాథుడు పండిత ధనంజయ భట్టాచార్యుల వారి వరండాలో కూర్చొని వేదాంత శాస్త్ర సూత్రాలూ భాష్యాలు వల్లించటం ప్రారంభించాడంటే బయటి ప్రపంచాన్ని పూర్తిగా మర్చిపోయేవాడు, దీర్ఘ కాయము, ఎత్తయిన లలాటముగల కాశీనాథ వంద్యోపాధ్యాయ వేదాంతశాస్త్ర లోతుల్లో లీనమై పోయినప్పుడు ఆయనికి ఈ ప్రపంచమే గుర్తుండదు. అది చూచి అతనిని గురించి ప్రజలు రకరకాలుగా వ్యాఖ్యానించే వాళ్లు. తండ్రి వలె గొప్ప పండితుడవుతాడని కొందరంటే, ఏమో అతిగా చదవటం వలన తండ్రివలె పిచ్చివాడవుతాడని మరి కొందరు అనేవారు. ఇలా ఆలోచించే వాళ్ళలో అతని మేనమామ కూడ ఒకడు. "అబ్బాయీ, పేదయింటి కుర్రాడివి, ఇంతకంటె పెద్ద చదువులు చదివి ఏం చేస్తావు? ఇప్పటికే చదివినంత వరకు చాలు. నాలుగు రాళ్లు సంపాదించుకొని నిశ్చింతగా బ్రతగ్గలుగుతావు. ఇంతకంటె ఎక్కువ చదివి నువ్వూ చనిపోయిన మీ నాన్నగారి వలె ఇంట్లో మూల కూర్చొని నీలో

నువ్వే మాట్లాడుకొంటూ తలాడిస్తూ ఉంటావా? ఇప్పుడున్న ఆశగూడ ఉండదు" అని మేనమామ మధ్యమధ్య అతనిని హెచ్చరించేవాడు.

మేనమామ హెచ్చరికలు, ఉపదేశాలు కాశీనాథుడు ఈ చెవితో విని ఆ చెవితో వదిలేసేవాడు.

పిచ్చి వాడయిపోతాడేమో అనే భయంతో మేనమామ అప్పుడప్పుడూ కోప్పడుతూ ఉండేవాడు. ఇంటిలో పనులు సరిగా చేయడని అటు అత్తగారు సాధిస్తూ ఉండేది, మేనమామ కొడుకు ఎగతాళి చేసేవాడు. ఏమీ జరగనటులే కాశీనాథుడు మెదలకుండా భరించేవాడు.

ఎన్ని హెచ్చరికలు చేసినా, ఎంత కోప్పడినా, ఏం చేసినా ఏమీ ప్రయోజనం లేక పోయింది. అన్నీ ఎప్పటి మాదిరే జరుగుతూ ఉండేవి. ఇష్టమైతే సాయంత్రం పూరి బయటకు షికారుకు వెళుతూ ఉండేవాడు, నదీ తీరాన ఉన్న రావి చెట్టు క్రింద కూర్చొని అస్తమించే సూర్యుని అరుణ కాంతిని చూస్తూ మైమరచి పోయేవాడు, ఒక్కొక్కప్పుడు గ్రామంలోని జమిందారు గారి భవనానికి వెళ్ళి అక్కడ శివాలయం ఎదుట అర్ధనిమీలిత నేత్రాలతో నిలబడి శివ పూజలో తనను తాను మర్చిపోయేవాడు. అదీ కాకపోతే తన మేనమామ గారి చండీ మండపానికి వెళ్ళి ఒక మూల ఏకాంతంగా కంబళీ పరచుకొని మెదలకుండా కూర్చునేవాడు.

ఇతని కేమీ పనిలేదన్నట్లు, ఒక ఉద్దేశ్యమో, ఒక కోర్కె ఏదీ లేనట్లు కన్పించేవాడు. పన్నెండవ ఏటనే తండ్రి పోయాడు. గత ఆరు సంవత్సరాల నుంచి అతడు మేన మామ ఇంటిలోనే ఉన్నాడు. తాను చేస్తున్న దేమిటి, భవిష్యత్తులో తానేమి చేయాలి, ఇంతకు ముందు తానేమి చేశాడు. ఇలాంటి ఆలోచన ఏదీ లేదతనికి. ఇక తా నేమి చేయాలో గూడ అతనికి తెలియదు. తాను ఏదో ఇలాగే కాలం గడప వచ్చుననీ, ఇక ఎప్పుడూ మామ గారింటిలో పెట్టేదేదో తింటూ, వారి చివాట్లుపడి ఉండాలనీ, తాను ఎక్కడికీ వెళ్ళ నవసరమూ లేదు, తాను ఏ పనీ చేయ నవస రమూ లేదన్నట్లు ఉండేవాడు. ఇంటిలో చీకటిగా ఉండే ఆ యేకాంత ప్రదేశం తనదేననీ, తనదిగానే ఉంటుందనీ, దానిని మరెవ్వరూ ఆక్రమించరనీ, తనను అక్కడి నుంచి ఎవ్వరూ తరిమివేయ లేరనీ అతడు అనుకొనేవాడు. ఆ పేట లోని వాళ్ళు అతనితో "కాశీనాథ్, ఏ పనీ చేయకుండా ఇలా కూర్చోవటం వలన ఏమీ ప్రయోజనం ఉండదు, ఏదో ఒకటి చేయాలి, ఏమీ చేయకుండా ఎలా గడుస్తుంది ?" అని అనే వారు. అందుకు కాశీనాథ్ ఏమీ జవాబు చెప్పేవాడే కాదు, 'తాను చేస్తున్న దేమిటి, తాను చేయవలసిందేమిటి' అనే అతడు తనలో తాను ఆలోచించేవాడు. రోజులు ఇలాగే గడిచి పోతున్నాయి.

# 2

ఆ గ్రామానికి జమిందారు ప్రియనాథ ముఖోపాధ్యాయ. ప్రియనాథబాబు అగ్రకులజులే గాక గొప్ప ధనవంతులు గూడా. ఐశ్వర్యం విషయంలోనూ, కులగౌరవాల విషయంలోను ఎంత గొప్ప వారయినప్పటికీ వారి కుమార్తెకు సర్వగుణ సంపన్నుడగు వరుడు దొరకలేదు. ఎంత వెతికినా వారికి నచ్చిన వరుడు లభించక పోయేసరికి వారికి కొంత చిరాకే కలిగింది. ఈ విషయాన్ని గురించి వారెప్పుడయినా భార్యవద్ద ప్రస్తావిస్తే ఆమె "నాకు ఒక్కగాను ఒక్క కుమార్తె, ఐశ్వర్యము, అగ్రకులము వీటి నేమైనా కొరుక్కు తింటామా ?" అని అనేది.

జమిందారు గారి గురువు ఆ గ్రామంలోనే ఉండే వారు. కుమార్తె వివాహ విషయంలో జమిందారుగారు వారిని గూడ సలహా అడిగారు. అందుకు వారు "హరిహరీ అదేమి మాట ? ధనసంపదల విషయంలో నీకెలాంటి లోటూ లేదు. మంచి కులంలో పుట్టిన ఏ పేద కుర్రాడినో చూచి అమ్మాయి నిచ్చి పెళ్ళి చేసి ఇద్దరినీ నీ ఇంటిలోనే ఉంచుకో. అలాచేస్తే బాగుంటుంది, నలుగురూ మెచ్చుకుంటారు."

ప్రియనాథబాబు ఇంటికి వచ్చి భార్యతో ఈ సంగతి చెప్పే సరికి అందుకు ఆమె గూడ చాల సంతోషించింది — "గురువుగారు చెప్పినది బాగానే ఉంది. అదే నేనూ కోరేది, అమ్మాయి మన కళ్ళఎదుటే ఉంటుంది."

చివరికి అదే జరిగింది, అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకోవాలనే కోర్కెతో ఒకనాడు ప్రియనాథబాబు పండిత మధుసూదన ముఖోపాధ్యాయ ఇంటికి వెళ్ళారు. ముఖోపాధ్యాయ గారు అప్పుడే ఒక యజమాని ఇంటిలో పూజచేయించటానికి బయలుదేరి వెళ్ళబోతున్నారు. ప్రియనాథబాబు రావటం చూచి అతడు సందిగ్ధంలో పడిపోయాడు. ఇంత పెద్ద జమిందారు గారు తన యింటికి వచ్చారంటే వారికి ఎలా మర్యాద చేయాలో, ఎక్కడ కూర్చోబెట్టాలో అతని కేమీ తోచటం లేదు. అతని సందేహాన్ని గ్రహించి ప్రియనాథబాబు "మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. లోనికి వెళదామా?" అని అన్నారు.

"అలాగే, దయచేయండి, కాని........"

"కాని గీని ఏమీలేదు. ఇలా రండి, విషయమేమిటో ఇప్పుడే చెపుతాను."

"ఇద్దరూ చండీ మండపం వైపు బయలుదేరారు. మండపం మీద కూర్చోగానే ప్రియనాథబాబు "మీ మేనల్లుడు ఎక్కడ ఉన్నాడు?" అని అడిగారు.

" భట్టాచార్యులగారి బడిలో ఉంటాడు."

"అతనిని ఒకసారి పిలిపించండి."

"ఇప్పుడే పిలిపిస్తాను, అంత ముఖ్యమైన పనేదైనా ఉందా ?"

"అవును, ముఖ్యమైన పనే."

ఎందుకూ పనికిరాని కాశీనాథునితో ఇంత పెద్ద జమిందారు గారికి పనేమిటూ అనేది మధుసూదనునికి అర్థం కాలేదు. అందుకని కొంచెం భయపడుతూ "వాడివల్ల ఏదైనా అపరాధం జరిగిందా ?" అని అడిగాడు.

" అపరాధం ఏముంది ? ఏమీ లేదు."

" అయితే అతనితో పనేమిటి ?"

ప్రియనాథబాబు నవ్వుతూ ఇలా అన్నారు—" అతనిని మా అల్లుడుగా చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఈ సంబంధంవల్ల మీరు నాకు వియ్యంకులవుతారు." ఈ మాట అని ప్రియనాథబాబు పకపక నవ్వారు.

ఏమి ఆలోచించి ప్రియబాబు నవ్వారో తెలుసుకోగలిగితే మధుసూదనుడు మాట్లాడకుండా ఊరుకునేవాడేమో ! ఆశ్చర్యంగా విస్ఫారిత నేత్రాలతో వారివైపు చూడ సాగాడు, కొద్దిక్షణాల అనంతరం " కాశీనాథ్‌నా ? " అన్నాడు.

" అవును. "

" ఎందుకని ?"

" ఎంత వెతికినా అలాంటి సాంప్రదాయం గల కుర్రాడు నాకు దొరకలేదు. మీాకేమైనా అభ్యంతరమా ?"

" అయ్యో; ఎంతమాట! అది మా అదృష్టం; కాని......... అతడు పిచ్చివాడు."

" పిచ్చివాడా! ఎలా ? నేను అలా అని ఎప్పుడూ వినలేదు."

" అతని తండ్రి పిచ్చివాడు."

కాశీనాథుని తండ్రి విషయం ప్రియబాబుకు సుపరిచితమే. ప్రజలు అతనిని పిచ్చివాడనే సంగతి గూడ ప్రియబాబుకు తెలుసు. కొద్ది క్షణాలు ఆలోచించిన అనంతరం " అతని పేరేమిటి ?" అని అడిగారు.

" కాశీనాథ వంద్యోపాధ్యాయ."

" మీారు అతనిని పిలిపించండి. ఒకసారి అతనిని కలుసుకోవాలను కొంటున్నాను."

మధుసూదనుడు, కాశీనాథ్‌ను పిలవటానికి తన చిన్న కొడుకును పంపాడు. అతడు పాఠశాలకు వెళ్లి 'కాశీభయ్యా' అని పిలిచాడు. కాశీనాథ్ తలెత్తి 'ఏమిటి' అని అడిగాడు.

" నిన్ను నాన్నగారు పిలుస్తున్నారు."

" ఎందుకు ?"

"ఎందుకో నాకు తెలియదు. మన జమిందారు గారు వచ్చారు, వారు నిన్ను పిలుచుకు రమ్మన్నారు."

పుస్తకం మూసి కాశీనాథ్ లేచి అతని వెంట ఇంటికి వచ్చాడు. ప్రియబాబు అతనిని ఒకసారి తేరిపార చూచి "కాశీనాథ్, ఎక్కడికి వెళ్లావు?" అని అడిగారు.

"భట్టాచార్యుల పాఠశాలకు."

"నువ్వు వ్యాకరణం చదువుకున్నావా ?"

"అవునండీ, చదివాను" అంటూ కాశీనాథ్ తల ఆడించాడు.

"సాహిత్యం చదివావా ?"

"కొద్దిగా చదివాను."

"ఇప్పుడేమి చదువుతున్నావు ?"

"సాంఖ్యదర్శనము."

ప్రియబాబు తృప్తిచెంది "సరే, వెళ్లి చదువుకో" అని చెప్పారు.

కాశీనాథ్ వెళ్ళిపోయాడు. తననెందుకు పిలిపించారో ఎందుకు వెళ్ళమన్నారో కాశీనాథ్‌కు ఏమీ అర్థం కాలేదు. స్కూలుకు వెళ్ళి అతడు పుస్తకం తీసి చదువుకో సాగాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత ప్రియబాబు మధుసూదనునితో "అతడు ఏదో పిచ్చివాడన్నారేమిటి మీరు?" అని అడిగాడు.

" అదికాదండీ, పిచ్చివాడు కాకపోయినా కొంత విచిత్రంగా ఉంటాడు. అందుకనే కొందరు అతనిని పిచ్చివాడంటారు."

" అదెలా ?"

" పుస్తకం తెరిచాడంటే సర్వమూ మరచిపోతాడు లేదా నిరుపయోగంగా అటూ ఇటూ తిరుగుతాడు. అతనిది కొంత విచిత్రమైన స్వభావమే."

" ఇంకా ఏమైనా చేస్తాడా ?"

" మరొకపని ఏమంటే, చీకటిలో గదిమూల గంటల తరబడి మెదలకుండా కూర్చుంటాడు."

ప్రియబాబు నవ్వుతూ "మరేమైనా?" అని అడిగాడు ఆ నవ్వులోని గూడార్థాన్ని గ్రహించి మధుసూదనుడు "లేదండీ, మరేమీ లేదు" అని జవాబు చెప్పాడు.

" ఒకసారి లోనికివెళ్ళి అడిగిరండి. అందరికీ అంగీకారమైతే ఈ నెలలోనే వివాహం జరిపిద్దాం."

లోనికి వెళ్ళి మధుసూదనుడు భార్యతో అన్ని విషయాలు చెప్పాడు. అది వినగానే ఆమెకు ఎక్కడలేని ఆశ్చర్యమూ కలిగింది. ఆశ్చర్యం నుంచి కొంత తేరుకొని ఆమె "మనకాశీకి ప్రియబాబు కుమార్తెతో వివాహమా ? మీకు పిచ్చెత్తలేదుగదా !" అని అంది భర్తతో.

" అదేమిటి, ఇందులో పిచ్చెత్తాల్సినదేముంది?"

" కాకపోతే ఏమిటిది?"

" కాశీనాధ్ ఉన్నతసాంప్రదాయం గల కుటుంబంలోని వాడనే విషయం మర్చిపోవద్దు."

ఆమె నిట్టూరుస్తూ " ఈ సంబంధం మన హారికి కుదర్చటానికి వీలుపడదా ?" అని అంది.

వీలుపడదనే విషయం ఇద్దరికీ తెలుసు. చివరికి మధు సూదనుడు దీర్ఘంగా నిట్టూరుస్తూ "ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

ఆమె కొంచెం లోలోపల బాధపడుతూ "నేను చెప్పే దేముంది ? మీ ఇష్టప్రకారనే కానివ్వండి" అని అంది.

మధుసూదనుడు బయటకు వచ్చి తెచ్చిపెట్టుకున్న నవ్వుతో ఇలా అన్నాడు— " ఇది విని నా భార్య చాలా సంతోషించింది. ఆమె సంతోషించకపోతే మరెవరు సంతోషిస్తారు, చిన్నతనం నుంచి కాశీని తల్లివలె పెంచి పెద్ద చేసింది. రెండు సంవత్సరాల వయస్సులోనే తల్లి గతించింది, ఆనాటి నుండి తానే పెంచింది. మా బావమరది పోయినప్పటి నుండి అతడు పూర్తిగా ఇక్కడే ఉంటున్నాడు."

ప్రియబాబు తల ఆడిస్తూ "అవన్నీ నాకు తెలుసు. ఇవాళే సంబంధం స్థిరపర్చుకుందాం" అన్నారు.

"ఇంకా స్థిర పర్చుకునే దేముంది ? మీరు ఎప్పుడు కోరితే అప్పుడే నేను వచ్చి ఆశీర్వదించి వస్తాను."

"అది కాదు సాంప్రదాయాన్ననుసరించే నేను అన్నీ జరగాలని కోరుతున్నాను."

"దానిని గురించి నేను చెప్పేదేముంది ? మీరు చెప్పినట్లే చేద్దాం. అయినా మీకు కాబోయే అల్లుడిగారి మేనత్తను కూడ అడగటం మంచిది."

"మంచిదే నేనూ అదే ఆలోచిస్తున్నాను."

కాశీనాధ్ మేనత్తను కూడ అడిగి ఆమె కోర్కె ప్రకారము వియ్యంకుడు వెయ్యి రూపాయలు ఇచ్చేట్లు నిర్ణయించ బడింది. అలాగే జరిగింది. ప్రియబాబు అందుకు అంగీకరించారు.

# 3

ఇప్పుడిక పూర్వం వలె కాదనీ, తాను ఇక్కడికి శాశ్వతంగా ఇల్లరికం వచ్చానని తెలుసుకున్న తరువాత కాశీనాధ్‌కు మానసిక సుఖం లోపించసాగింది. అతడు తన ఇష్టప్రకారం ఎక్కడికీ వెళ్ళకూడదు, ఏపనీ చేయకూడదు, అతనికి తన

వ్యక్తిత్వమే లేనట్లనిపించ సాగింది. ఎక్కడికయినా వెళ్ళాలంటే మామగారి అనుమతి లభించేది కాదు లేదా అత్తగారు కోపగించుకునేది. పాపం, కాశీనాథ్ చేసేదేమీ లేక మెదలకుండా వూరుకునేవాడు. తన మీద ఇంత కఠోరమయిన అధికారం ఎందుకా అని అతనికి ఆశ్చర్యం కలిగేది. ఈ అధికారం వల్ల ఇతరులకు వచ్చేలాభం ఏమిటి ? అతనికి ఏమీ అర్థం అయ్యేదికాదు. ఏదో విధంగా సరిపెట్టుకొని పోయేవాడు. కాని అతనికి మనసులో మాత్రం తనకేమీ సుఖం లేదనీ. శాంతి లేదనీ, సంతృప్తి లేదనీ మెదులుతూ ఉండేది. పూర్వం అతడు స్వేచ్ఛగా తిరిగేవాడు, ఇప్పుడు బంగారుపంజరంలో బంధింపబడ్డాడు. ఈ విషయాన్ని అతడు పూర్తిగా గ్రహించాడు. పూర్వం విశాలసముద్రంలో ఈదుతూ ఉండే తాను ఇవాళ ఒక ముళ్ళపొదలో చిక్కుకున్నాడు. సముద్రంలో అతడు సుఖంగా ఈదుతూ ఉండేవాడా అంటే అదీ లేదు, అక్కడ కూడ తుఫానుతోను అలలతోను ఆటలాడ వలసి వచ్చేది, కాని ఈ నిర్మల సరోవరం మరింత కష్టదాయకమయింది. అప్పుడప్పుడు తనను తీసుకువచ్చి వేడినీళ్ల కుండీలో పడవేసినట్లనిపించేది. అందరూ కలిసి సంప్రదించుకొని తన శరీరాన్ని కొనివేశారా అనిపించేది, అతనికి నాది అనేది ఏమీ మిగల్లేదు. నెత్తిమీద పిలక లేదు, మెడలో రుద్రాక్షలమాల లేదు, కాళ్ళకుకూడ ఖరీదైన చెప్పులు తగిలించారు, నగ్న శరీరం కాదిప్పుడు, వెనుకటి పాఠశాల లేదు, నదీతీరాన ఉన్న

రావిచెట్టు లేదు, చండీమండపంలో ఏకాంతగా కూర్చొనే అవకాశం లేదు. ఇప్పుడు అవన్నీ ఏమీ లేవు.

పూర్వజన్మలోని వస్తువులన్నిటినీ త్యజించి కొత్తగా జన్మించినట్లుంది అతనికి. శరీరము మనస్సు పరస్పరం దెబ్బలాడి అలసిపోయాయి. సాయంత్రమయే సరికి మనస్సు నదీ తీరాన ఉన్న రావిచెట్టువద్దకో లేదా రైతుల మధ్యనో సంచరిస్తూ ఉంటే శరీరం విలువైన దుస్తులు ధరించి గుఱ్ఱపు బండిలో షికారు తిరుగుతూ ఉండేది. మనస్సు అంగవస్త్రం చుట్టుకొని నదిలో మునకలు వేస్తూ ఉంటే ఇక్కడ శరీరం సువాసన తైలము, సబ్బులతో తోమి నౌకర్ల ద్వారా స్నానం చేయించ బడుతూ ఉండేది. ఈ విధంగా కాశీనాథ్‌లో రెండు విభిన్న వ్యక్తిత్వాలు ఏర్పడ్డాయి. అతని పని ఏదీ నచ్చిన విధంగానూ జరిగేదికాదు, పూర్తయ్యేదీకాదు.

ఇలాగే రోజులు గడచి పోతున్నాయి. పన్నెండు మాసాల కాలం అత్తవారింటిలో జరిగింది. మొదట కొద్ది నెలల వరకు బాగానే ఉంది, కొత్తదనమనే మోహంలోపడి వెనక్కి తిరిగి చూచుకోవలసిన అవసరం కూడ కలుగలేదు, కాని ఇప్పుడు ఆ భావం క్రమంగా అంతరించసాగింది. అతని పరిస్థితిని గురించి ఇతరులు గమనించారో లేదోగాని కమల మాత్రం గ్రహించింది; ఆమెకు బాధ కలిగింది. ఒక

నాడు ఆమె భర్తను "మీరు రోజురోజుకు అలా చిక్కి-పోతున్నా రేమిటి?" అని అడిగింది.

" అలా అని ఎవరన్నారు ?"

" చూస్తే కన్పిస్తూనే ఉందిగదా ?"

" పొరపాటు పడ్డావు."

" విషయమేమిటో నాకు చెప్పండి" అంది కమల లాలనగా.

" ఏమీ లేనిదే ఏమని చెప్పను ?"

" ఏదో ఉంది."

" ఏమీ లేదు."

" ఏదో ఉంది. నాకు అన్నీ తెలుసు."

కాశీనాథ్ ముఖం అటు తిప్పుకొని "అనవసరంగా నన్ను విసిగిస్తావెందుకు ? నేనిక్కడి నుండి వెళ్ళిపోతాను" అన్నాడు.

అతడు లేచి వెళ్ళబోయేసరికి కమల అతని చెయ్యి పట్టుకొని బ్రతిమాలుతూ "వెళ్ళకండి, ఇక ఎప్పుడూ మిమ్మల్ని ఏమీ అనను" అని అంది.

కొద్ది క్షణాల వరకు కాశీనాథ్ కూర్చున్నాడు, తరువాత లేచి వెళ్ళిపోయాడు. ఈ సారి కమల అతనిని ఆపలేదు. భర్త అకస్మాత్తుగా లేచి చెప్పకుండా వెళ్లేసరికి ఆమె అవమానంతో దిండులో ముఖం దాచుకొని పడుకొంది.

బయటకు వచ్చిన తరువాత కాశీనాథ్ మనస్సు కొంచెం తేలికపడింది. గేటుదాటి అతడు రోడ్డుమీదికి వచ్చాడు. కొంత దూరం వెళ్ళి అతడు వెనక్కి తిరిగి చూచాడు, అతని వెనుకనే ఒక సేవకుడు వస్తున్నాడు, కాశీనాథ్ మండిపడ్డాడు. సేవకుడు దగ్గరకు రాగానే "నువ్వెక్కడికి వస్తున్నావు?" అని అడిగాడు.

అతడు నమస్కరించి "బాబుగారివెంట" అని జవాబు చెప్పాడు.

"నా వెంట ఎవరూ రానవసరములేదు, నువ్వెళ్ళు."

"సాయంత్రము ఒక్కరే షికారుకు వెళతారా బాబూ?"

అందుకు జవాబేమీ చెప్పకుండా కాశీనాథ్ ముందుకు సాగి పోయాడు. సేవకునికి ఏమీ అర్థం కాలేదు, తానేమి చేయాలో కూడ నిశ్చయించుకోలేక పోయాడు. చివరికి తాను తిరిగి వెళ్ళిపోవడమే మంచిదనుకున్నాడు. కాశీనాథ్ ఇక అదేమీ గమనించకుండా సరాసరి మామగారింటికి వెళ్ళాడు. వసారాలోకి వెళ్ళి మెదలకుండా కూర్చున్నాడు. కొంతసేపటికి హరిబాబు షికారుకు వెళ్ళటానికని బయటకు వచ్చి అతనిని చూచాడు. కనుచీకటిగా ఉన్నందువలన అతనిని వెంటనే గుర్తించలేకపోయాడు. దగ్గరగావచ్చి "ఎవరా మనిషి?" అని అడిగాడు.

కాశీనాథ్ మెల్లగా "నేనే" అని జవాబు చెప్పాడు. హరిబాబుకు ఆశ్చర్యం కలిగింది, "ఎవరు ? చిన్న జమిందారుగారా?" అన్నాడు వెంటనే.

కాశీనాథ్ ఏమీ మాట్లాడలేదు. హరిబాబు బిగ్గరగా కేకలువేయుచు" అమ్మా, ఇలా ఒకసారి రా, జమిందారు గారి అల్లుడు వచ్చారు, ఎక్కడున్నారు! మీ రేమి మర్యాద చేసినట్లు కూడ లేదు" అని పిలిచాడు.

హరి తల్లి పరుగుపరుగున వచ్చి "ఎంత అదృష్టం, దరిద్రురాలగు అత్త గుర్తొచ్చిందా బాబూ!" అని అంది.

కాశీనాథ్ అప్పటికీ ఏమీ మాట్లాడలేదు. అత్త తన పెద్దకుమార్తె బిందువాసినిని పిలిచింది— "అమ్మా బిందూ, ఓ, బిందూ! త్వరగా ఒకసారిలా రా. బావగారు వచ్చారు. కూర్చోటానికి ఏదైనా తీసుకురా, ఇంతలో నేను పూజ ముగించుకొని వచ్చేస్తాను" అని చెప్పింది.

బిందువాసిని మధుసూదన భట్టాచార్యులవారి కడగొట్టు సంతానం. వివాహమై సంసారానికి వెళ్ళినందువల్ల ఆమె తరచు పుట్టింటికి వచ్చే అవకాశం లేదు. ఈసారి ఆమె ఇక్కడికి వచ్చి నెలరోజులయింది, కాని ఇంతవరకు కాశీనాథ్‌ను చూచలేదు. కాశీ అంటే ఆమెకు చాలా ప్రేమ, అతని పేరు వినగానే ఆమె గబగబ అక్కడికి వచ్చింది. వచ్చి చూస్తే ఎవరూ కన్పించలేదు. వసారాలో చీకటిగా ఉంది, అక్కడ

ఎవరో కూర్చున్నట్లు మాత్రం కన్పించింది. కాశీ బావను ఈ స్థితిలో మాత్రం ఆమె ఇంతకు ముందెన్నడూ చూడలేదు.

కాశీ బావ ఇప్పుడు పెద్దవాడై పోయాడు, పెద్ద ఇంటి అల్లుడు కావటంతో 'బాబుగారై' పోయాడు అనేది ఆలోచించే సరికి ఆమెకు నవ్వొచ్చింది, కాని దగ్గరగా వచ్చి విచారంగా ఉన్న అతని ముఖాన్ని చూచే సరికి ఆమె నవ్వు కాస్తా మాయమయింది. ఇంతకు ముందెప్పుడూ కూడ కాశీ బావ అలా విచారంగా ఉండటం ఆమె చూడలేదు. అదీగాక అంతకు పూర్వం కూడ కాశీ బావ స్వభావం తెలిసినది ఆమె ఒక్క దానికే. దగ్గరగా వచ్చి ప్రేమతో అతని వీపునిమురుతూ ఆమె "కాశీ బావా, ఇక్కడ కూర్చున్నావేమిటి! లోనికి వచ్చి కూర్చో" అని అంది. కాశీ నెమ్మదిగా లేచి లోనికి వెళ్ళి కూర్చున్నాడు.

"నేను వచ్చి ఎంత కాలమయింది, నువ్వు చూడటానికి ఇప్పుడు వస్తున్నావా బావా" అంది బిందువాసిని దెప్పుతూ,

"రాలేక పోయాను బిందూ."

"ఎందుకని ? ఎందుకని రాలేకపోయావు?"

కాశీనాథ్ అస్పష్టంగా గొణుగుతూ "వాళ్లు రానివ్వరు" అన్నాడు.

"ఎందుకు రానివ్వరు?"

" వాళ్లు అంతే, ఏమీ లేదు " అన్నాడు కాశీనాథ్ పరధ్యానంగా.

బిందువాసిని చాలా నొచ్చుకుంటూ "నీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్లటానికి వీలుండదా?" అని అడిగింది.

" ఉండదు, నన్ను వెళ్ళనివ్వరు. అందువల్ల మా మామ గారి మర్యాదకు లోపం వస్తుందట."

ఇలాంటి విషయాలవల్ల కాశీ బావకు చాలా బాధ కలుగుతుందని బిందు గ్రహించింది. అందుకని ఆమె సంభాషణా ధోరణి మారుస్తూ "బావా, నాకు మా అక్కను చూపించ లేవేం ?" అని అడిగింది.

అతడు ఏమీ మాట్లాడ లేదు.

" మా అక్క ఎలా ఉంటుంది ?" అని బిందు తిరిగి ప్రశ్నించింది.

" బాగానే ఉంటుంది."

" అయితే ఒకనాడు వచ్చి చూడమంటావా?"

అతడు బిందువైపు చూచి చిరునవ్వునవ్వుతూ "వచ్చి చూడు" అన్నాడు.

అదేసమయంలో బయట ఏదో బండివచ్చి ఆగిన చప్పుడు వినిపించింది. "నీ కోసం బండి వచ్చినట్లుంది" అంది బిందు.

" అవును, అలాగే ఉంది."

కాశీ వెళ్ళిపోతూ "ఎప్పుడు వస్తావు?" అని అడిగాడు బిందును.

" ఎక్కడికి ?"

" మీ అక్కను చూడటానికి."

బిందు చిరునవ్వునవ్వుతూ "నీకు వీలున్నప్పుడు వచ్చి తీసుకువెళ్లు" అని అంది.

" రేపు రానా ?"

" తప్పకుండా రా."

రెండో రోజున కాశీనాథ్ బండి తీసుకొని వచ్చాడు. బిందు ప్రయాణమై బయలుదేరటానికి సిద్ధమయ్యే వేళకు హరిబాబు వచ్చాడు. లోనికి వచ్చేప్పుడే ఇంటిముందు బండిని చూచి అతడు వూహించుకో గలిగాడు. లోనికి వచ్చి అతడు తల్లిని పిలిచి "బిందు ఎక్కడికి వెళుతుందమ్మా ?" అని అడిగాడు.

" కాశీ భార్యను చూడటానికి వెళుతుంది" అని తల్లి సహజ ధోరణిలో జవాబు చెప్పింది.

" ఎవర్నీ ? జమిందారుగారి కుమార్తెనా ?"

తల్లి ఏమీ మాట్లాడలేదు, మెదలకుండా వూరుకుంది.

హరిబాబు ముఖం గంభీరంగా మారింది, ఇలా అన్నాడు— "బిందు అక్కడికి గనుక వెళితే జీవితపర్యంతం నేనిక బిందు ముఖం చూడను."

తల్లి ఆశ్చర్యపడుతూ " ఎందుకని ? బావ భార్యను చూడటానికి వెళ్లటంలో తప్పేముంది ?" అని అంది.

" తప్పు ఒప్పుల సంగతి నాకు తెలియదు. నేను చెప్ప దలచింది ఒకటేమాట, బిందు నామాట వినకుండా వెళితే మళ్ళీ తిరిగి ఈ ఇంటిలో కాలుపెట్టటానికి వీలులేదు, అంతే."

హరిబాబు స్వభావం బిందువాసినికి పూర్తిగా తెలుసు, ఆమె మెదలకుండా తన అలంకరణలన్నీ తీసివేసింది, దుస్తులు మార్చుకొంది. కాశీ మెదలకుండా చూస్తు నిలబడి పోయాడు. లోలోపల [illegible]నపడుతూ ఒక్కడే బండిలో తిరిగి వెళ్లి పోయాడు.

సాయంత్రం కమల భర్తను " మీా మేనమామ కుమార్తె రాలేదేం ?" అని అడిగింది.

" వాళ్లు రానివ్వలేదు " అని కాశీనాథ్ ఎంతో నిరుత్సాహంగా జవాబు చెప్పాడు.

" ఎందుకని ?"

" ఎంపుకో తెలియదు, ఇక్కడికి పంపటానికి సిగ్గుపడుతున్నారేమో !"

కమల హృదయంలో ఈ మాట నాటుకు పోయింది.

# 4

ప్రియబాబుకు కమల ఏకైక సంతానము. ఇంతకు పూర్వము ఆయన రెండు వివాహాలు చేసుకున్నారు, సంతానము కలుగలేదు. ఇద్దరు భార్యలు చనిపోయిన తరువాత వయస్సు మళ్లిన ప్రియబాబు మూడో వివాహం చేసుకున్నారు, మూడో భార్యకు కలిగిన ఏకైక సంతానము కమల. లేక లేక కలిగిన ఏకైక సంతానమయినప్పుడు కుమార్తెకు కుమారునికి తేడా ఏమీ ఉండదు. అందువల్ల కమలను అతి గారాబంగా చూసుకునే వాళ్లు. ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఎవరూ ఏమీ చేసేవాళ్లుకారు. కమల ధనవంతురాలు, అందమైనది, గుణవతి, చదువుకున్నది. ఇన్ని ఉండికూడ ఆమె ఒక మనిషిని వశం చేసుకోలేక పోతున్నది, అతడు మరెవరోకాదు, ఆమె భర్తే. కమల అనేక ఉపాయాలను అనుసరించింది. కోపగించుకుంది, ఏడ్చింది, అభిమానాన్ని ప్రదర్శించింది, సేవ చేసింది; ఎన్ని చేసినా ఆమె భర్తను వశపర్చుకోలేక పోయింది. అతనికి సన్నిహితం కూడ కాలేక పోయింది. పేదవాడయినప్పటికీ తన భర్త హృదయం ఎంత విశాలమయినదో ఆమె గ్రహించలేకపోయింది. అతని మనస్సును తనకు ఇవ్వమని ఆమె రోజూ ఉదయము సాయంత్రము భగవంతుణ్ణి ప్రార్థించేది.

అతనిలో అసలు మనస్సు అనేదే లేదేమోనని అప్పుడప్పుడు ఆమె వూహించేది. మనస్సనేదే ఉంటే తానెందుకు పొంద లేదు ? కాశీనాథ్ ఆమెకు రోజురోజుకు ఒక కఠిన సమస్యగా తయారయ్యాడు. తనకు లభించినంతగా భర్త ప్రేమానురాగాలు మరెవ్వరికీ లభించవేమోనని అప్పుడప్పుడు ఆమె ఆలోచించేది, కాని అంతలోనే జీవితములో ఏ స్త్రీ ఇంత దుస్సహ నిర్లక్ష్యాన్ని కూడ పొందదేమో అనే ఆలోచన కలిగేది. రోజులు ఏదో విధంగా గడిచి పోతున్నాయి. కాశీనాథ్ కే మరీ ఇబ్బందిగా ఉంది. ఇప్పుడతనికి గ్రంథపఠనమూ నచ్చటంలేదు, మౌనముగా కూర్చోటంలో పూర్వపు ఆనందమూ లేదు, హాసపరిహాసాలన్నా అతనికి ఇష్టం లేదు. పుష్టిగా ఉన్న అతని శరీరము క్రమంగా కృశించి నల్లబడిపోసాగింది. భర్త రోజురోజుకు ఇలా కృశించి పోవటం చూచి కమలకు విచారం పట్టుకుంది. ఇంకెప్పుడూ తానేమి అడగనని ఆమె ప్రతిజ్ఞ చేసినప్పటికీ ప్రతిజ్ఞాభంగం జరుగనే జరిగింది. ఒకనాడు ఆమె భర్త పాదాలపై బడి ఏడ్వసాగింది. కాశీనాథ్ ఆమెను లేవనెత్తాలని ప్రయత్నించాడు, కాని ఆమె కాళ్ళను గట్టిగా పట్టుకొని వదలలేదు.

"ఎందుకు ఏడుస్తున్నావు ? ఏం జరిగింది?"

కమల ఏమీ మాట్లాడలేదు. చాలాసేపు వెక్కి వెక్కి అలాగే అతని పాదాలపై తల ఆన్చి "మీరు నన్ను

ఒక్కసారే చంపి వేయండి, ఈ విధంగా నన్ను చిత్రవధ చేయకండి" అని అంది.

కాశీనాథునికి చాలా విస్మయం కలిగింది— "ఏం జరిగిందో చెప్పరాదూ! ఇంతకూ నేను నీకు కలిగించిన కష్టం ఏముంది?" అని అడిగాడు.

"మీకు తెలియదా?"

"లేదు, నాకేమీ తెలియదు."

"ఇంకా మీరు సాధించ దలచిందేమైనా ఉంటే పూర్తిచేయండి; మీ పాదాలచెంత నాకు జానెడు చోటిస్తే చాలు, నేను మిమ్మల్ని మరేమీ కోరటం లేదు."

కాశీనాథ్ ప్రేమత ఆమెను లేవనెత్తుతూ "అసలు విషయం ఏమిటో స్పష్టంగా చెప్పు" అని అడిగాడు.

"మీరు రోజురోజుకు ఎలా అయిపోతున్నారో తెలుసా?"

"నేను అంతగా చిక్కిపోయానా?

కొంగును ముఖానికి అడ్డుపెట్టుకొని కమల ఏడుస్తూ ఉంది— "అవును, చాలా చిక్కిపోయారు" అని జవాబు చెప్పింది ఏడుస్తూనే.

"నాకు తెలుస్తూనే ఉంది, అందుకు నేనేం చేయను? ఇందులో నా అపరాధమేముందో నువ్వే చెప్పు."

"మీరేమీ మందు ఎందుకు తినరు ?" అని అడిగింది కమల.

కాశీనాథ్ నవ్వి "మందువల్ల లాభమేమీ ఉండదు" అన్నాడు.

"ఎందుకని ?"

"ఎందుకనో నాకూ తెలియదు."

"మందువల్ల లాభం లేకపోతే మరిదేని వల్ల ఉపయోగం ఉంటుందంటారు ? ఇంతకూ మీ ఉద్దేశ్యం ఏమిటి ? నాకు ఈ మాత్రము అదృష్టం లేకుండా కూడా చేయదలచారా ?"

సంస్కృత పాఠశాలలో చదువుకున్న అమాయకుడు, ప్రేమపద్ధతులేమీ తెలియనివాడు, ప్రణయసంభాషణలో అనుభవం లేని కాశీనాథ్ స్వాభావికమైన స్నేహభావంతో కమల చేతిని పట్టుకొని ఆమె కన్నీటిని తుడుస్తూ "ఇక్కడ నాకేమీ సుఖం లభించటంలేదు, అందుకని ఇలా అయిపోతున్నానేమో!" అని అన్నాడు.

"అయితే ఇక్కడ ఎందుకు ఉంటున్నారు ?"

"ఉండక చేసేదేముంది ? ఎక్కడికి వెళతాను?"

"ఇక్కడ కాకపోతే మరెక్కడా చోటులేదా ? ఎక్కడ సుఖంగా ఉంటుందో అక్కడికే వెళ్లండి."

"అలా జరగదు."

"ఎందుకు జరుగదు ?"

"ఇక్కడ ఉండకపోతే మామగారికి కష్టం కలుగుతుంది."

"అయితే మీరిలా రోజురోజుకూ కృశించటం వల్ల వారికి కష్టం కలుగదా ?

"కష్టం కలుగుతుంది, కాని చేయగలిగేది మాత్రం ఏముంది ? మీ నాన్నగారు నా పేద తనాన్ని......"

కమల భర్తనోటికి చేతిని అడ్డుపెట్టి తరువాత అతనేమీ మాట్లాడనీయలేదు— "అయ్యో, రామరామ, అలాంటి మాటలు అనకూడదండీ. అసలు విషయమేమిటో నాతో ఏమీ దాచకుండా చెప్పండి, నేను ఏదో ఒక మార్గం ఆలోచిస్తాను."

కాశీనాథ్ కొంచెం స్థిమితపడి ఇలా అన్నాడు— "మనసులోని సంగతులన్నీ పైకి చెప్పలేముగదా !" అని కొద్ది క్షణాలు ఆగి "ఇవన్నీ చూస్తూ ఉంటే అసలు మనిద్దరికీ వివాహం జరిగి ఉండాల్సింది కాదేమో నని పిస్తుంది," అన్నాడు.

"ఎందుకని ?"

"నువ్వే ఆలోచించు, నన్ను చేసుకున్న తరువాత నువ్వు ఒక్క రోజునైనా సుఖపడ గలిగావా ? నాకు ప్రేమ వ్యవహారాలు తెలియవు. ప్రేమించటం తెలియను, నిజం

చెప్పాలంటే అసలేమీ తెలియదు నాకు. ఈ చిన్న వయస్సులో నీకు అనేక కోర్కెలు ఉంటాయి, ఏవేవో అభిలాషలు ఉంటాయి, ఒక్కటైనా తీరిందా ? నేను నీ భర్తను కాదు, నీడలాంటి వాడిని."

కమల కళ్లనుండి కన్నీరు కారసాగింది. ఆమెకు ఏమీ అర్థం కావటం లేదు, అంతా అయోమయంగా ఉంది. ఆమె మనసులోని మాట మనసులోనే ఉండిపోయింది. బయటకు రావాలని విలవిల తన్నుకొంటున్న ఆ మాటను ఎవరో బలవంతాన గాలి వెలుతురు లేని గదిలో బంధించినట్లుగా ఉంది. ఎంత ప్రయత్నించినా ఆమె ఏమీ మాట్లాడలేక పోతుంది. చివరకు అతి ప్రయత్నంతో నోరు తెరిచి కంపిత స్వరంతో " నన్ను చూడటం మీకు ఇష్టం లేదా?" అని అడిగింది.

" ఆ విషయం మరెప్పుడైనా చెప్తాను."

" ఇంతకూ అసలు విషయం చెప్పరేం ? నావల్ల మీకు సుఖం లేదు, అంతేగా ?"

" ఏం చెప్పను, సుఖం లేదేమో !"

" మరొకరివల్ల సుఖం ఉండేదా ?"

" ఏమో చెప్పలేను."

కమలకు శరీరమంతా భగభగ మండిపోతున్నట్లని పించింది. ఇంతలో దాసి వచ్చి "అమ్మాయి గారూ, అమ్మ

గారికి జ్వరం ఎక్కువగా ఉంది, మిమ్మల్ని పిలుస్తున్నారు" అని చెప్పింది.

కళ్లు తుడుచుకుంటూ కమల గదిలో నుంచి బయటకు వెళ్ళిపోయింది.

# 5

కమల తల్లికి జ్వరం తగ్గలేదు. పదిహేను రోజులు బాధ పడిపడి చివరికి అందరినీ దుఃఖసాగరంలో ముంచి శాశ్వతంగా కన్ను మూసింది. భార్య పోవటంతో ప్రియబాబు మానసికంగా చాలా క్రుంగిపోయాడు. ఈ వృద్ధాప్యంలో తానూ ఎంతో కాలం జీవించననే ప్రియబాబు ఆలోచించాడు. గృహనిర్వాహణ బాధ్యతలన్నీ కమల నెత్తినే పడ్డాయి తన సుఖదుఃఖమే కాకుండా కూడ మనిషి ప్రపంచంలో ఎన్నో చేయవలసి వస్తుంది. ప్రియబాబు సంరక్షణకూడ ఆమే చూచుకోవలసి వచ్చింది. మరి కాశీనాథ్ ? అతని విషయమే వేరు. అవకాశం దొరికేసరికి బండెడు పుస్తకాలు ముందేసుకొని తలుపులు బిగించి గదిలో కూర్చుంటాడు. చదువులో విసుగెత్తినప్పుడు బయటికి షికారుకు బయలుదేరేవాడు. ఒక్కొక్కసారి రెండేసి రోజులు మూడేసి రోజులు ఇంటికే వచ్చేవాడు కాదు. ఎవరికీ

అతని జాడే తెలిసేది కాదు. అతని ఈ స్థితిని చూచి కమల చాలా నిరాశ చెందింది. ఆమె యువతే అయినా ఇంకా బాలిక లక్షణాలు పోలేదు. పతిప్రేమ, పతిభక్తి అనేవి ఇంకా ఆమెకు సరిగా తెలియనే తెలియవు. భర్తతో ఇలాంటి బాధ వచ్చిపడితే ఆమె ఎలా తెలుసుకో గలుగుతుంది! ఇందులో ఆమె అపరాధం మాత్రం ఏముంది? ఏదైనా నేర్చుకున్న దంటే క్రమంగా దానినీ మర్చిపో సాగింది. ఆమె హృదయం మీద కొన్ని సువర్ణ రేఖలు పడ్డాయి, వాటికి మెరుపు రానే లేదు, బాహ్య సౌందర్యం లోనికి ప్రవేశించనే లేదు, స్వతఃహా గానే అదృశ్యం కాసాగింది.

కమల ఏమీ తెలుసుకో లేక పోయింది. ఒక్కొక్క ప్పుడు ఆమెకు అన్నీ గజిబిజిగా కన్పించేవి. కూలిపోయిన ఇంటి ఇటుకలు, వాసాలు అన్నీ చిందరవందరగా పడి ఉన్న మాదిరిగా కన్పించేది అంతా ఆమెకు, వాటిని ఆమె ఒకచోట చేర్చాలని ప్రయత్నించేది, కాని ఆమెకు అంత సామర్థ్యం లేదు, ఆమె ప్రయత్నం ఫలించేది కాదు. ఒకప్పుడు అది దివ్య భవనము, ఆనందోద్యానము, కాని స్వప్నముతో పాటే అది కూడ అంతరించింది. స్వప్నాలు నిద్రపోయాయి, ఆ స్వప్నాలను మళ్ళీ ఆహ్వానించటానికి ఆమె సాహసించ లేక పోతుంది.

వృద్ధుడైన తండ్రికి సేవచేస్తూ దాసదాసీల మీద అజ మాయిషీ చేయటంతో ఆమెకు కాలం సుఖంగానే గడిచి

పోతుంది, కాని ఆమెకు ఇందులో యదార్థమయిన సుఖం లేదు. కమల యొక్క మానసిక వ్యథను చూచి వృద్ధదాసి లోలోపల కుమిలిపోతూ ఉండేది. ఒకనాడు ఆమె యేకాంతం లో ప్రియబాబుతో ఇలా చెప్పింది— "బాబూ, చిన్నబాబు గారి తత్వం ఏమిటో బోధపడకుండా ఉంది. ఆయన ఇష్టమైతే అలాగే కూర్చొని ఉండి పోతారు, లేదా ఎక్కడికైనా వెళ్ళి పోతారు. ఎప్పుడు యేమి చేస్తారో ఎవరికీ తెలియదు. అమ్మాయిగారితో కూడ అంత మాట్లాడినట్లు కన్పించరు."

ప్రియబాబు తన అస్వస్థతను గురించే ఎంతో బాధపడు తున్నారు. ఈ విషయాలను గురించి ఆలోచించే అవకాశమే లేదు. వృద్ధదాసి మాటలు ఆయనలో సంచలనాన్ని కలిగిం చాయి. ఆయన కమలను పిలిచి "అమ్మా, నేను అడిగిన వాటికి ఏమీ దాచకుండా జవాబు చెపుతావా?" అని అడిగారు.

కమల తండ్రి ముఖంలోకి నిశితంగా చూస్తూ "దేనిని గురించి నాన్నగారూ?" అని అడిగింది.

" చూడు తల్లీ, ఇందులో సిగ్గుపడాల్సిన పనేమీ లేదు. కష్టం వచ్చినప్పుడు కన్నతండ్రి వద్ద దాచుకోవలసిన అవసరం లేదు. నాతో ఏమీ దాచకుండా చెప్పు. విషయాలు తెలిస్తే నేను వాటిని సరిదిద్దుతాను."

కమల ఏమీ మాట్లాడలేదు.

కొద్ది క్షణాలు ఆగి మళ్ళీ ప్రియబాబు ఇలా అన్నారు — "నువ్వు సుఖంగా ఉండాలనే ఉద్దేశ్యంతో నే నిన్ను సత్య మైన వారికి అప్పగించాను. అదీగాక నువ్వు తప్ప నాకు మాత్రం మరెవరున్నారు? నువ్వు దుఃఖ పడుతూ ఉంటే నేను సుఖంగా, ప్రశాంతంగా మరణించలేను." ముసలి తండ్రి నేత్రాలు అశ్రుపూరితాలై కనుకొలకులలోంచి కన్నీటి బిందువులు చెంపల మీదికి జారాయి. కమల పరిస్థితి కూడ అలాగే ఉంది తండ్రి ఆమె కన్నీటిని తుడిచి ఓదారుస్తూ " తల్లీ, నాతో యేమీ దాచకుండా అన్నీ చెప్పు" అన్నాడు.

ఏమి చెప్పాలో కమలకు ఏమీ కర్థంకాలేదు. మౌన భంగం కలిగిస్తూ మళ్ళీ ప్రియబాబు "మీరిద్దరూ ఏమయినా కీచులాడుకున్నారా?" అని అడిగారు.

అసలు పొంతనే కుదరనప్పుడు తగాదా ఎలా వస్తుంది అని కమల ఆలోచించింది. లేదన్నట్లు మౌనంగానే తల వూపింది.

" తగాదా యేమీ లేనప్పుడు ఇంకా యేముంది, నువ్వు అతనికి నచ్చ లేదా? ఇంతకూ యేదో ఒక కారణం ఉండాలి గదా?"

అవును, అదేవిషయం అని కమల చెప్పాలనుకొని కూడా చెప్పలేక పోయింది. భర్తకు తాను నచ్చలేదనే విష యాన్ని చెప్పటానికి ఆమె మనస్సు అంగీకరించలేదు. ఆమె

హానం వహించింది. ప్రియబాబు నీరసంగా నవ్వుతూ "ఆయనే నీకు నచ్చలేదా ?" అని అడిగాడు. కమల హృదయం సందేహంతో కంపించ సాగింది, ఆమె తన హృదయాన్ని శోధించుకుంది, కాని ప్రయోజనం లేక పోయింది. ఆమెలోని సంగీతగతి ఆగిపోయినట్లనిపించింది, ఎప్పుడో ఒకరిద్దరు వచ్చి పోతుంటారు, ఎప్పుడో అజాగ్రత్తవల్ల తెలియకుండానే ఏదో ధ్వని విన్పిస్తుంది, మనస్సులోని మారుమూలలకు ఎప్పుడో ఎవరో దూరం నుంచే ఒకసారి తొంగి చూస్తారు, అంతే. కమల తన అశ్రు నయనాలను కొంగు చాటున దాచుకుంది. ప్రియబాబు జాలిపడుతూ "ఏడ్వకు తల్లీ !" అని అన్నాడు.

"నాన్నగారూ, మా ఇద్దరి మధ్య చాలా దూరం ఉంది."

ప్రియబాబు కుమార్తెను హృదయానికి హత్తుకున్నాడు— "అమ్మా, ఛీ ! అలా ఆలోచించ కూడదు. నీ తల్లే నీకు సర్వమూ; ఇప్పటికీ రాత్రులందు ఆమె వచ్చి నా పాదాల వద్ద కూర్చుంటుంది. మీ భయం వల్ల పగలు రావటం లేదు. సాయంత్రం కావచ్చింది, ఒకవేళ ఆమె నీ మాటలు గనుక వింటే చాలా బాధ పడుతుంది."

సూర్యుడు అస్తమించాడు. గదిలో చీకటి ఆవరించింది. గదిలోకి ఎవరూ రాలేదుగదా అని కమల ఉలిక్కిపడి చుట్టూ చూచింది, ఎవరూ కన్పించ లేదు, మనస్సు కొంచెం కుదుట

పడింది. గది బయటకు వచ్చినప్పుడు ఆమె పాదాలు వణుకుతున్నాయి, శరీరంలోని సగం రక్తాన్నెవరో తీసుకున్నట్లు చాలా నీరసంగా ఉన్నట్లనిపించింది. ఇంటి పనులన్నీ ముగించుకొని ఆమె కాశీనాథ్ గదిలోకి వచ్చింది. దీపం వెలుగుతూ ఉంది. నేలమీద చాప పరుచుకొని పుస్తకం ఏదో చదువుతూ కూర్చున్నాడు కాశీనాథ్. అతడు తలెత్తి చూసేసరికి ఎదురుగా కమల కన్పించింది. ఆశ్చర్యపడుతూ అతడు "నువ్వు వచ్చి ఎంత సేపయింది ?" అని అడిగాడు.

" అవును, వచ్చాను."

" కూర్చో " అని కాశీనాథ్ మళ్ళీ చదువుకోటంలో మునిగిపోయాడు. కమల మెదలకుండా కూర్చొని భర్తను చూడ సాగింది. అతని చదువు ఆమెకు ఎంత మాత్రం నచ్చ లేదు. చూచి చూచి ఆమె అతడు చదువుతున్న పుస్తకాన్ని మూసేసింది. కాశీనాథునికి చాలా ఆశ్చర్యం కలిగింది. "పుస్తకం మూసేశావెందుకు ?" అని అడిగాడు.

" రోజూ చదివే చదువే గదా, ఒక్కరోజు చదవక పోతే మునిగిపోయేదేమీ లేదు, ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుందాం."

" అందుకోసమని పుస్తకం మూసేశావా ?"

" అందుకని కాదు, ఆ పని చేస్తేమీకు కోపం వచ్చి అప్పుడైనా నాలుగు మాటలు మాట్లాడతారని."

కాశీనాథ్ చిరునవ్వునవ్వి ఇలా అన్నాడు— "కోపం ఎందుకు వస్తుంది కమలా ? నువ్వేమీ మాట్లాడవు, దగ్గరకు రావు. అలాంటప్పుడు నేను చనుకోకపోతే ఇక కాలం గడచే దెలా ? రెండు రోజుల్నుంచి జ్వరంగా ఉంది, ఇంతవరకు ఏమీ తినలేదు. అయినా నువ్వు ఇటు తొంగి చూడనైనాలేదు" అంటూ మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

కమలకు చాలా జాలివేసింది. భర్తముఖం వాడిపోయి నట్లుండటం ఆమె గమనించింది. నుదురుమీద చేయి వేసి చూచింది, కాలిపోతుంది. ఆమె ఏడుస్తూ 'మీరు నా తప్పులన్నీ మరిచిపోయి నన్ను క్షమించండి. ఇక మీ భారమంతా నా మీద వదలండి" అని అంది,

" నా భారాన్నంతా నీ చేతుల్లో పెట్టటం అనేది నేను ఇప్పుడే చేయగలను, కాని నువ్వు సంభాళించుకోగలవా ?"

" ఎందుకు సంభాళించుకోలేను ?"

" చూద్దాం."

" మీరు నన్ను పరాయిదానిగా చూడకండి."

" నేను నిన్నెప్పుడూ అలా చూడలేదు. నిన్నెప్పుడో హృదయ పూర్వకంగా స్వీకరించాను; కాని నువ్వు నన్ను అర్థం చేసుకోటానికే ప్రయత్నించలేదు, ఇక ముందు కూడ అర్థం చేసుకోలేవేమో !"

దీపకాంతిలో కమల తనివితీరా భర్తను చూచింది. ఆ ముఖం లోపల ఒక అగ్ని కణము బూడిదమధ్య దాగి ఉన్నట్లుగా కన్పించింది, మౌనంలో మధువు దాగి ఉన్నట్లని పించింది. క్షణకాలం ఆమె తనను తాను మర్చిపోయింది. ఆవేశంతో ఆమె ఇలా అంది — "ఇంత కాలం మీరు నాకు అర్థం చేసుకునే అవకాశాన్నెందుకు ఇవ్వలేదు ? మిమ్మల్ని మీరెందుకు దాచుకున్నారు ? నన్ను బాధపెట్టి మీకు పొంద గలిగిందేమిటి ?" సంతోషంతో మైమరచి ఆమె భర్త మెడను కౌగలించుకొంది. కాశీనాథుని కళ్లనుంచి కన్నీటి బిందువులు జారి ఆమె మీద పడ్డాయి.

# 6

మర్నాడు ప్రియబాబు కాశీనాథ్‌ను పిలిపించి ఇలా చెప్పారు— "నాయనా, నేనింకా ఎంతో కాలం జీవించను, నాకు వెనకాముందూ మరెవరూ లేరు. ఉన్న పొలము, ధనము అంతా నీదే. నేను ఎన్నో రోజులు బ్రతకను, ముందేమి జరుగనున్నదో ఏమో, ఇప్పటినుంచే నువ్వు ఈ జమిందారీ వ్యవహారాలన్నీ చూడటం నేర్చుకో."

కాశీనాథ్ తలవంచుకొని "మీరు ఆజ్ఞాపించినట్లే చేస్తాను" అని జవాబు చెప్పాడు.

"ఇందులో ఆజ్ఞాపించే దేముంది నాయనా, రేపటి నుంచి రోజూ ఉదయమే ఒకసారి కచేరీకి వెళ్లివస్తూఉండు" అన్నారు ప్రియబాబు.

"అలాగే" అని చెప్పి కాశీనాథ్ గదిలోనుంచి బయటకు వెళ్లిపోయాడు. ప్రియబాబు కమలను పిలిచి ఇలా చెప్పాడు — "అమ్మా, నేను ముసలివాడినై పోయాను, నేనేమీ పని చేయలేకపోతున్నాను. అందుకని జమిందారీ భారమంతా కాశీనాథ్‌కు అప్పగించాను, అందువల్ల ముందు ముందు ఏమీ ఇబ్బంది ఉండదు. మధ్యమధ్య నేనూ చూస్తూ ఉంటాను."

చాలా రోజుల వరకు ప్రియబాబు కాశీనాథ్‌ను తానే వెంటబెట్టుకొని కచేరీకి వెళుతూ చిన్న పెద్ద విషయాలు తెలియజెప్పేవారు. కాశీనాథ్‌కు కూడ ఇది సంతోషంగానే ఉంది. ఇంట్లో లోలోపల రగులుతున్న చిచ్చు కొంత శాంతించింది.

కాశీనాథ్ నియమంగా రోజూ ఆఫీసుకు వెళ్ళి పనీపాటా చూడటం ప్రారంభించాడు. కమల ఇంటి వ్యవహారాలు చూచుకొంటుంది. వృద్ధ ప్రియబాబు విశ్రాంతిగా కాలక్షేపం చేస్తు

న్నాడు. అన్నీ సక్రమంగానే జరిగిపోతున్నాయి, ఉన్నట్లుండి అకస్మాత్తుగా ప్రియబాబుకు సుస్తీ చేసింది. రోజురోజుకు రోగం హెచ్చుతూ ఉంది. ఒకనాడు ఆయన కమలను పిలిచి తలగడ క్రింద ఉన్న వీలునామా బయటకు తీసి ఇలా చెప్పారు —"అమ్మా, నేను వీలునామా వ్రాయించాను. నాకున్న ఆస్తి మొత్తంలో సగభాగం అల్లుడు కాశీనాథ్‌కు చెందేట్లు; మిగిలిన సగం భాగం కుమార్తె కమలకు చెందేట్లు వ్రాశాను — ఏమంటావమ్మా. మంచిదేగదూ !"

కమల ఏమీ మాట్లాడలేదు. ప్రియబాబుకు ఆశ్చర్యం కలిగింది— " ఏమిటమ్మా, నీకు ఇష్టం లేదా ?" అని అడిగాడు ప్రియబాబు. కమలను సంతోషపెట్టటానికే వారీ వీలునామా వ్రాశాడు. ఆస్తి అల్లుడికి వ్రాస్తే కుమార్తె చాలా సంతోషిస్తుందని ఆయన ఆలోచించాడు, కాని కమల ఆలోచన వేరుగా ఉంది. ఏమి చెప్పటానికీ ఆమె సంకోచపడసాగింది. ఆమె సిగ్గుపడుతూ ఉండటం చూచి ప్రియబాబు "ఏమమ్మా, ఏమైనా చెప్పాలనుకున్నావా?" అని అడిగాడు.

అవునన్నట్లు కమల తల ఆడించింది.

" ఏదాం చెప్పాలనుకొంటున్నావో చెప్పు

కమల మొదట సంకోచపడినా తరువాత కొంచెం స్థిమితపడి "ఆస్తంతా నా పేరనే వ్రాయండి" అని చెప్పింది.

"ఎందుకని ?"

కమల తలవంచుకొని మెదలకుండా కూర్చుంది.

ప్రియబాబు ఎంతో అనుభవం ఉన్న వ్యక్తి, ఆయన ప్రపంచంలో రకరకాల వ్యక్తుల్ని చూచారు. కమల యొక్క మనోభావాన్ని ఆయన ఇట్టే గ్రహించగలిగారు. విషయాలు ఒక్కటొక్కటిగా ఆయనకు లోతుగా అవగతం కాసాగాయి, ఆయనను వ్యాకులపర్చసాగాయి. దిండును ఆనుకొని కూర్చొనే ఆయన కళ్లుమూసుకున్నాడు.

చాలాసేపు మౌనంగా ఉన్న అనంతరం ఆయన ఇలా అన్నాడు— "అమ్మా, ఒక్కగాను ఒక్క కుమార్తెవు, కొడుకువైనా కూతురువైనా నువ్వే, కనుక నీకు బాధ కలిగించటం నాకెంతమాత్రం ఇష్టంలేదు. ఉన్న ఆస్తినంతా నేను నీపేరనే వ్రాస్తాను, కాని దాని వల్ల నీకు మేలు జరగదు. నువ్వు సుఖంగా ఉండాలనే నా కోర్కె, అలాగే ఆశీర్వదిస్తున్నాను, కాని అలా జరుగుతుందని మాత్రం నాకు నమ్మకం లేదు. నేనీ జీవితంలో ఎన్నో చూచాను, అనేకం విన్నాను, మరెన్నో విషయాలు అనుభవంలో అర్థం చేసుకున్నాను, మొత్తం మూడు వివాహాలు చేసుకున్నాను. అందుకనే ఇలాంటి మనస్తత్వం ఉంటే ఏ స్త్రీ సుఖపడలేదని చెప్పగలుగుతున్నాను." మరి కొద్ది క్షణాలు మెదలకుండా వూరుకొని తిరిగి ఇలా అన్నారు "చూచేవాళ్లకు, ఎవరైనా విన్నా

అందరికీ సబబుగా కన్పిస్తుంది, నువ్వూ సంతోషిస్తావని ఆలోచించే నేను ఇద్దరికీ చెరిసగం ఆస్తి వ్రాశాను. అదీగాక మీరిద్దరూ వేరు కాదని కూడ నాకు తెలుసు. సరే ఇప్పుడవన్నీ ఎందుకు ? నువ్విలా ఆలోచించటానికి కారణం ఏమిటి ?''

కమలకు దుఃఖం వచ్చినంత పనయింది— "ఆస్తి చేతిలోకి వచ్చిందంటే ఎవరూ నావైపు కన్నెత్తికూడ జూడరు '' అని అంది.

"ఆస్తి రాకపోతే ?''

"నేను చెప్పినట్లుంటారు.''

ప్రియబాబు ఇలా అన్నారు — "కాశీనాథ్ స్వభావం నాకు తెలుసు, అతనిని నువ్వు అర్థం చేసుకో లేదు. అతడు అచ్చం తన తండ్రి లాంటి వాడే. అతడు నిన్ను చూడ దలచుకోనట్లయితే సంపద లభించినా చూడడు. సంపద లభించటము, లభించక పోవటములో పెద్దగా తేడా ఏమీ ఉండదు. అమ్మా, ఒక సంగతి మాత్రము గుర్తుంచుకో, ఈ విధముగా భర్తను అదుపులో పెట్టుకోవటము అసాధ్యము. బలముతో అడవిలోని సింహాన్నయినా వశపర్చుకోవచ్చు, కాని ఒక పుష్పం మీద అలాంటి బల ప్రయోగము కుదరదు.''

కొంతసేపు మెదలకుండా పూరుకొని వారు మళ్ళీ ఇలా అన్నారు— "భగవంతుడు నీకోర్కెను నెరవేర్చుగాక, కాని నువ్వు ఆలోచించింది సరియైనది కాదమ్మా. అతడు సహజంగానే తన హృదయంలో నీకు చోటివ్వకపోతే ఇక నీకు మిగిలేది మాత్రం ఏముంది ? మిగలటానికి సగం ఆస్తి చాలదా ? మరొక విషయం, భర్తకు తనువు, మనస్సు, ఆత్మ, ధనము సర్వమూ అర్పిస్తారు — సర్వమూ అర్పించే ఆ భర్తకు సగము ఆస్తికూడ ఇవ్వకూడదా ? కమలా, అలా ఆలోచించవద్దు, ఎప్పుడైనా అతనికి ఈ విషయం తెలిస్తే ఎంతో బాధ కలుగుతుంది."

కమల ఏమీ మాట్లాడలేదు, ప్రియబాబు కూడ మౌనం వహించారు. అరగంట వరకు తండ్రీ కూతుళ్ళిద్దరూ మౌనంగానే ఉండిపోయారు. చీకటి పడింది, దాసీ దీపం వెలిగించి తెచ్చి గదిలో పెట్టింది. కమల కళ్ళు తుడుచు కుంటూ లేచి గదిలో నుంచి బయటకు వెళ్ళింది; తరువాత గృహ కృత్యాల్లో మునిగి పోయింది.

మర్నాడు ప్రియబాబు వకీలును పిలిపించి "నేను వీలు నామా మార్చాలనుకొంటున్నాను" అని చెప్పారు.

"మార్చటం ఎందుకు?" అని ప్రశ్నించారు వకీలు.

"అల్లుని పేరు తొలగించి ఆస్తంతా అమ్మాయి పేరనే వ్రాయాలని ఆలోచించాను."

"ఎందుకని ?"

"ఆ ప్రశ్న అనవసరం. నేను చెప్పినట్లు చేయండి."

# 7

ప్రియబాబు శ్రాద్ధ కర్మలు యథావిధిగా జరిగి పోయాయి, తరువాత ఒకనాడు కాశీనాథ్ ప్రియబాబు వ్రాసిన వీలునామాను చూచాడు, అయితే అందువల్ల అతనికి ఆశ్చర్యంగానీ, బాధగానీ ఏమీ కలగలేదు. ఇలాంటివి ప్రపంచంలో రోజూ జరిగేవే. అలాంటిదే ఇదీనూ. కనుక మామూలు ప్రకారమే జరిగింది. ఇందులో దుఃఖపడవలసింది గానీ, ఆశ్చర్యపడాల్సింది గానీ ఏమీ లేదు. అయినా ఒకనాడు దివానుగారు కాశీనాథ్‌తో ఏకాంతంలో ఇలా అన్నారు—"చిన్నబాబూ, చాలా అనర్థం జరిగింది. బాబుగారు వీలునామా ఈ విధంగా వ్రాస్తారని నేను కలలో కూడ ఆలోచించ లేదు. మొట్టమొదట వారు వ్రాసిన వీలునామాలో మీకు, కుమార్తెకు ఆస్తినంతా చెరిసగం వ్రాశారు. తరువాత దానిని ఎందుకు మార్చివేశారో, అలా చేయమని ఎవరు సలహా చెప్పారో ఏమీ అర్థం కావటం లేదు."

కాశీనాథ్ చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు— "ఇందులో అర్థం కావటానికి ఏముంది గనుక? ఆస్తి ఎవరిదో వారికే లభించింది, అందులో మధ్య మీకేమిటి, నాకేమిటి?"

దివానుగారు కొంత సంకోచిస్తూ "అయినా...అయినా ......" అంటూ నసిగారు.

"ఇందులో 'అయినా' అనే సందేహానికే లేదు. నిజం ఆలోచిస్తే ఈ ఆస్తి మీద నా కెలాంటి అధికారమూ లేదు. వారు నాపేర సగం వ్రాస్తే అది ఆశ్చర్యపడాల్సిన విషయం. అదీగాక నాకు సగం ఇచ్చినా, ఆమెకు పూర్తిగా ఇచ్చినా రెండూ ఒకటేగదా, ఇందులో భేదం ఏముంది?"

దివానుగారు ఆ మాట విని మరింత నీరసించి పోయారు. మాట మారుస్తూ ఇలా అన్నారు— "అవునవును, భేదం ఏమీ లేదు. నేను అన్నది పెద్దబాబు గారిని గురించే. వారి మనోభావాలు నాకు పూర్తిగా తెలుసు కనుక ఆమాట అన్నాను."

"వారు తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు. మీరూ ఆలోచించి చూడండి, స్త్రీకి భర్త తప్ప వేరు గతి లేదు, కాని భర్తకు వేరే ఆధారమనేది కూడ ఉంటుంది. నేను పేదవాడిని, అకస్మాత్తుగా ఇంత ఆస్తి ఒక్కసారి చేతికి వస్తే చెడిపోయే అవకాశం ఉంటుంది. బహుశా ఆ విషయం ఆలోచించే మామగారు వీలునామా మార్పించి ఉంటారు"

కాశీనాథ్ ఏమీ తెలియని మూర్ఖుడనే వృద్ధ దివాను అనుకొంటూ ఉండేవాడు. అలాంటిది ఇప్పుడు ఎంతో తెలివిగా మాట్లాడిన కాశీనాథ్ మాటలు విని వృద్ధ దివాను హృదయం అతనికి నమస్కరించింది. వృద్ధ దివానుకు కాశీనాథ్ పట్ల సదభిప్రాయము, గౌరవభావము హెచ్చిన కొద్దీ కమల ఇటు అతనికి నానాటికి దూరమవుతూ ఉంది. రోజూ కొన్ని వందలసార్లు" ఆయన ఎలాంటి వ్యక్తి ?'' అని తనను తానే ప్రశ్నించుకుంటూ ఉండేది. ఆమెకు ఏమీ అర్థమయ్యేదికాదు. చివరకు విసుగు గలిగి 'ఏమీ అర్థం కావటం లేదు' అనుకునేది.

లక్షప్రయత్నించినా రెండు కాళ్లు రెండు చేతులు గల ఈ మనిషి ఏవస్తువుతో తయారయ్యాడో ఆమె నిర్ణయించుకోలేక పోయింది. అతని శరీరంలో మనస్సు అనేది ఉందా లేక ఎక్కడైనా తాకట్టు పెట్టాడా ? ప్రపంచంలో అందరూ చేసినట్లే తన భర్తకూడ చేస్తున్నాడనే సంగతి ఆమెకు తెలుసు. తింటున్నాడు, నిద్రపోతున్నాడు, జమిందారీ వ్యవహారాలు చూచుకొంటున్నాడు. అన్ని విషయాల్లోనూ అతనికి ఆసక్తీ, విరక్తీ రెండూ ఉన్నాయి. తన భర్తకు ఏది నచ్చుతుంది, ఏదంటే అతనికి ఎక్కువ ఇష్టమో ఆమె నేటికీ తెలుసుకోలేక పోయింది. కమలకు ఎప్పుడైనా జబ్బుచేస్తే కాశీనాథ్ రాత్రంతా నిద్రమేల్కొని ఆమె చెంతనే కూర్చునేవాడు.

అతని ముఖంలో ఎంతో విషాదం, హృదయంలో ప్రేమ, స్నేహము హెచ్చి అవధులు దాటి బయటకువ్యక్తమయ్యేవి. ఆమె కొంచెం లేచి తిరగటం ప్రారంభించగానే అతడు మెదల కుండా ఆమె ఎదుట పడకుండా తప్పుకునేవాడు, మళ్ళీ తన పనిలో మునిగి పోయేవాడు. ఒక్కొక్కసారి కమల అలిగి రెండేసి రోజులు అతనితో మాట్లాడటం మానేసేది, కాని ఫలితం ఏమీ ఉండేది కాదు. కాశీనాథ్ దగ్గరగా వచ్చి వెళ్ళిపోయేవాడు; ఆమెతో మాట్లాడనూ లేదు, ఆమెను బ్రతిమాలనూ లేదు. అయితే మళ్ళీ కమల సంతోషంగా పలకరించి మాట్లాడితే అతడూ ఎప్పటివలె సంతోషంగా మాట్లాడేవాడు. గత రెండు రోజులుగా ఆమె ఎందుకు మాట్లాడ లేదనిగాని, ఎందుకు కోపంగా ఉన్నావనిగాని అతడు ఏనాడూ అడిగేవాడు కాదు. చివరకు అనేక విధాల ఆలో చించిన తరువాత భర్త తనను లక్ష్యం చేయనప్పుడు తానూ ఇక అతనిని లక్ష్యం చేయకూడదని ఆమె నిర్ణయించుకుంది. తానిక అతని పాదాలకు అంటిపెట్టుకొని ఉండకూడదనుకొంది, అతనికి లొంగి అడుగులకు మడుగులొత్తుతూ పడి ఉండాల్సిన ఖర్మ తనకేమిటి అనుకొంది. కనుక భర్త ఎదురు పడగానే ముఖం పక్కకు తిప్పుకొని వెళ్ళిపోయేది లెక్క లేనట్లుగా. ఏదో దయతలచి నిన్ను నా భర్తగా చేసుకున్నానే కాని నీ పాదాలను అంటిపెట్టుకొని ఉండటానికి కాదు, నాకు అవసరమైనప్పుడు తీయగా మాట్లాడతాను, నాపని సమయంలో

ఎదురయితే మీవైపు కన్నెత్తి కూడ చూడను అని చెప్పటమే ఆమె ఆ విధంగా చేయటంలో గల ఉద్దేశ్యం.

ఎప్పుడైనా ఆమె దాసదాసీలను తిడుతూ ఉండగా కాశీనాథ్ అటు రావటం జరిగి ఏదైనా అంటే విన్పించుకోనట్లే నటించేది. ఆమె మామూలుగా తిడుతూనే ఉండేది. 'ఈ దాసదాసీలు నా మనుష్యులు, ఈ యిల్లు నాది, నేను తిడ తాను, కొడతాను, నా యిష్టం – మధ్యలో అడ్డం రావటానికి మీరెవరు ?' అనేది.

ఈ మాటలవల్ల తృప్తి కలుగదా ? ఈ విధంగా అను కున్న కోర్కె నెరవేరుతుందా ? తృప్తి అనేది గలిగితే మాత్రం ఆమె కాశీనాథ్‌ను చలింపజేసేదే. ఎవరు ఏది చేసు కున్నాసరే, కాశీనాథ్ తన వరకు తాను నిశ్చింతగా ఉండే వాడు, ఆ భావం అతని ముఖంలో స్పష్టంగా కన్పించేది, సుమేరు పర్వతం వలె ఏమీ చలించనట్లు కన్పించేవాడు. ఎంత విర్రవీగినా, తుపానులా విరుచుకుపడి ప్రళయరూపం ధరించినా నేను లేశమైనా చలించను అన్నట్లు ఉండేవాడు.

కమల అతనిని ప్రేమించటం లేదా ? ప్రేమిస్తుంది, కాని అందులో గాంభీర్యము లేదు. లక్ష్మణుడు గీసినట్లు గీతగీసి దానిని దాట వద్దని శాసించినట్లుండేది. దాటి వెళితే నేనెంత మాత్రం సహించను సుమా అని హెచ్చరించినట్లుండేది.

అప్పుడూ నేను నిన్ను ప్రేమించవచ్చునేమో గాని నీ గౌర వాన్ని మాత్రం మన్నించను.

ఒకనాడు ఆమె వృద్ధదాసీ ఎదుట తన కష్టగాథనంతా చెప్పుకొని ఏడుస్తూ "నాన్నగారు నన్ను ఒక జంతువుకు అంట గట్టి పోయారు" అని అంది.

"అదేమిటమ్మా ?"

" ఏమని చెప్పను ? మీ రందరూ కలిసి నన్ను కాళ్లు చేతులు కట్టి ఏ నూతిలోనో త్రోసివేస్తే బాగుండేది.''

" ఏమి మాటలమ్మా అవి ?''

" ఏం మాట లేకుంది, నేను నిజమే మాట్లాడు తున్నాను. మీరు ఆ పనిని ఎంతో తేలిగ్గా తీసివేశారు, దానిని నేను ఒకసారి నోటితో అంటే తప్పా ?''

" కాదు, అదేమీ లేదమ్మా ! ఆయన చాలా మంచి వారు. కొద్దిగా వెర్రి ఉన్నమాట యదార్థమే. తండ్రికీ అలాంటి వెర్రే ఉండేది, అదే కుమారునికీ వచ్చింది—''

" నువ్వు నోరుమూసుకో. వెర్రివాడని అనకు. తండ్రి పిచ్చివాడయినంత మాత్రాన కుమారుడు కూడ పిచ్చివాడవా లని ఎక్కడుంది ? ఆయనకు పిచ్చేమీ లేదు, నన్ను బాధ పెట్టటానికి ఇలా చేస్తున్నారు.''

తన భర్త పిచ్చివాడని అంగీకరించటానికి కమలకు చాలా బాధ కలిగింది.

ఇవాళ్టికి మూడు రోజులనుండి కాశీనాథ్ జాడ తెలియదు. రెండురోజుల వరకు ఆమె అతనిని గురించి ఏమీ విచారించలేదు, కాని మూడవనాడు గాబరాపడి బంట్రోతును పిలిచి అడిగింది— "రెండు రోజుల్నుంచి బాబుగారు ఎక్కడికి వెళ్లారో తెలయ లేదు; మీరెవరూ ఆ సంగతే విచారించలేదు, మీరందరూ ఉండి ఎందుకు ?"

బంట్రోతు ఆలోచించసాగాడు, 'ఇది మరీ బాగుంది. ఎవరు ఎక్కడికి వెళ్ళారో, ఏం చేస్తున్నారో ఎవరు తెలుసుకుంటారు. మూడు వేలు డబ్బు తీసుకొని కాశీనాథ్ ఎక్కడికో వెళ్లినట్లు తరువాత కాషియరు ద్వారా తెలిసింది. ఎక్కడికి వెళ్ళాడో, ఎప్పుడు వస్తాడో ఎవరితోనూ ఏమీ చెప్పి వెళ్ళలేదు.

కమల చేత్తో తలపట్టుకొని కాస్సేపు ఆలోచించింది. తరువాత తమ వకీలును పిలిపించి "జమిందారీ వ్యవహారాలు చూడటానికి సమర్థుడైన మేనేజర్ని చూడండి, ఎంత జీతమైనా భరిస్తాను" అని చెప్పింది.

# 8

రోజంతా వర్షంలో తడిసి కాశీనాథ్ బురదనుదాటి సాయంత్రానికి కలకత్తాలోని ఒక ఇరుకైన సందులో ఉన్న చిన్న డాబాలోకి చేరుకున్నాడు. అతని వద్ద రెండు మందు సీసాలు, ఒక బిస్కట్లుడబ్బా, రుమాలు మూటలో దానిమ్మ మొదలగు పండ్లు ఉన్నాయి.

గదిలో మంచం మీద ఒక రోగి పడుకొని ఉన్నాడు. తలవైపున ఒక స్త్రీ కూర్చొని రోగి నుదుటను నిమురుతూ ఉంది. కాశీనాథ్ లోనికి వెళ్ళగానే ఆ స్త్రీ "కాశీబావా, ఇంత వర్షంలో తడిసి రాకపోతే ఏం ? వర్షం తగ్గేవరకు ఎక్కడైనా ఆగలేక పోయావా ?" అని అంది.

"ఎలా ఆగుతాను ? వర్షంలో తడిసినందువల్ల అంతగా నష్టం ఏమీ ఉండదు. ఎక్కడైనా ఆగి సమయానికి మందు తీసుకరాకపోతేనే ఎక్కువ నష్టం."

బిందు ఆలోచించింది, అదీ నిజమే, అనుకుని ఇక ఆమె ఏమీ మాట్లాడలేదు.

గత అనేక సంవత్సరాలుగా బిందు ఎలాంటి జీవితాన్ని అనుభవిస్తుందో ఆమెకే తెలుసు. మనం ఆమెను ఒకసారి

పుట్టింట్లో చూడటం తప్ప తరువాత ఆమెను గురించి మనకేమీ తెలియదు. ఇప్పుడు ఆమెను గురించి కొద్దిగా తెలుసుకుందాం. కమలను చూడటానికి ప్రయాణమై కూడ పిరమించుకున్న మర్నాడు ఆమె మామగారగు గోపాలబాబుకు చాలా జబ్బుగా ఉన్నదని విని వెంటనే అత్తవారింటికి బయలుదేరి వెళ్ళింది. నిజంగానే మామగారికి చాలా జబ్బుగా ఉంది. ఎన్నో మందులు వాడారు, కాని గోపాలబాబు రోగం తగ్గ లేదు. రోగం నానాటికి ముదిరిపోయింది, ఒకనాడు వారు చిన్న కోడల్ని పిలిపించారు.

చిన్నకోడలంటే మరెవరో కాదు, మన బిందువాసినే. చనిపోవటానికే ఒకటి రెండు రోజుల ముందుగా గోపాలబాబు బిందుతో "అమ్మా, ఇదుగో తాళంచెవి. ఆ పెట్టెలో ఉన్న వన్నీ నీవే" అని చెప్పారు.

బిందు మామగారు ఇచ్చిన తాళంచెవితీసుకొంది. ముసలి వాడు చస్తూ చస్తూ ఉన్నదంతా చిన్నకోడలికి ఇచ్చిపోయాడని మిగిలిన కోడళ్లందరూ అనుకున్నారు. ఇక్కడ మరో సంగతి చెప్పాలి. జబ్బుగా ఉన్నప్పుడే గోపాలబాబు తన నలుగురు కుమారులను పిలిచి ఇలా చెప్పారు — "నాయనలారా, మీలో సఖ్యత లేదు, మీ తల్లి కూడ లేదు, నేను చనిపోయిన తరువాత మీరు కలిసి ఉండవద్దు. అనవసరంగా మీలో మీరు కలహించుకొని ఇప్పుడున్న సఖ్యతను పాడు చేసుకోవద్దు.

ఉన్న వేదో తలాకాస్తా తీసుకొని ఎవరి సంసారాలు వారు దిద్దుకోండి. మీరు పంచుకునే దానికి తోడు మరికొంత సంపాదించుకో గలిగారంటే హాయిగా మీ సంసారాలు గడచిపోతాయి.''

తండ్రి చనిపోగానే నలుగురు అన్నదమ్ములూ వేరు పడ్డారు. ఒకనాడు బిందు మామగారు ఇచ్చిన పెట్టెను తెరిచి చూచింది. అందులో రామాయణము, మహాభారతము తప్ప ఏమీ లేవు. కొంత నిరాశ చెందినప్పటికీ చనిపోయిన మామగారు తనకు బహూకరించిన ఆ కానుకను ఆమె గౌరవ భావంతో చూచుకొంది. దానినే అమూల్యమైన సంపదగా భావించింది.

బిందువాసినికి కొంతకాలం వరకు హాయిగానే గడచిపోయింది, రానురాను కష్టపరంపర ప్రారంభమయింది. ఆమె భర్త యోగేశబాబుకు అకస్మాత్తుగా జబ్బుచేసింది. తన ఆరోగ్యాన్ని కూడ లెక్కచేయకుండా ఆమె రాత్రింబవళ్లు భర్తకు అనేక విధాల సేవచేయ సాగింది. ఉన్న పొలాన్ని తాకట్టు పెట్టి భర్తకు వైద్యం చేయించింది, కాని ఏమీ సుగుణం కన్పించ లేదు. కలకత్తా తీసుకువెళ్లి చికిత్స చేయించమని ఇరుగుపొరుగు వాళ్లు సలహా చెప్పారు. బిందు తన నగలన్నీ అమ్మివేసి భర్తను కలకత్తాకు తీసుకువచ్చింది. ఇక్కడ కూడ అనేకమంది డాక్టర్ల చేత చికిత్స చేయించింది, పొలాన్ని

తాకట్టు పెట్టిన చోట మరి కొంత డబ్బు తెచ్చింది. రోగం మాత్రం తగ్గలేదు సరికదా రోజురోజుకు హెచ్చుతూ వచ్చింది. రానురాను డబ్బులేక సరియైన చికిత్స చేయించ లేక పోయింది. బిందు తన బాధలన్నీ తెలియజేస్తూ పెద్దబావగార్కి ఉత్తరం వ్రాసింది, ఆ ఉత్తరానికి జవాబే లేదు. మిగిలిన ఇద్దరు బావ గార్లకు కూడ ఉత్తరాలు వ్రాసింది, వాళ్లు కూడ ఏమీ జవాబు వ్రాయకుండా వూరుకున్నారు. ఇక ఉపవాసాలైనా చేయాలి లేదా ఇంత విషం తిని ప్రాణత్యాగమయినా చేయటం తప్ప మరో మార్గం లేదని బిందు ఆలోచించింది.

భార్య ముఖాన్ని చూచే యోగేశబాబు పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. ఒకనాడు అతడు చాలా ప్రేమతో ఆమెను దగ్గర కూర్చోబెట్టుకొని ఇలా చెప్పాడు— "బిందూ, నన్ను మన గ్రామానికి తీసుకువెళ్లు, మరణమే శరణ్యమయినప్పుడు అక్కడే చావటం మంచిదికదా ? ఇక్కడ చనిపోతే దహనం చేసేవాళ్లు కూడా ఎవరూ లేరు."

అవసానకాలం దగ్గరపడిందనే బిందు ఆలోచించింది, మరో ఉపాయమేమీ లేదు. భర్తను గ్రామానికి తీసుకువెళ్లే మార్గం కూడ కన్పించలేదు. భర్తను ఈ స్థితిలో వదలి ప్రాణ త్యాగం చేయటం కూడ ఆమెకు అసాధ్యమే. చచ్చే వాళ్లకు సిగ్గేమిటి ? అనేక విధాల ఆలోచించి సిగ్గువదలి పరిస్థితినంతా

వినరిస్తూ కాశీనాథ్‌కు ఉత్తరం వ్రాసింది. తరువాత జరిగినది పాఠకులకు తెలిసినదే.

వచ్చేప్పుడు కాశీనాథ్ వెంట చాలా డబ్బు తెచ్చాడు. అతడు పట్టణంలోని పెద్దపెద్ద డాక్టర్లను సంప్రదించాడు. ఈ వాతావరణం మారనిదే లాభం లేదని అందరూ చెప్పారు. కాశీనాథ్ అందర్నీ తీసుకొని వైద్యనాథ్ చేరుకున్నాడు. రెండు మాసాలు గడిచింది, యోగేశబాబు మృత్యుముఖం నుండి బయట పడినట్లేనని అతడు అనుకున్నాడు. ఇంకా అక్కడ కొంత కాలం ఉండాల్సిందే కనుక కాశీనాథ్ వాళ్ళను అక్కడే వదలి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఉదయం కమల అతనిని చూచి "ఎప్పుడు వచ్చారు ?" అని అడిగింది.

"రాత్రి" అని సంక్షిప్తంగా జవాబు చెప్పాడు కాశీనాథ్.

కమల మెదలకుండా వెళ్ళి తన పని తాను చూచుకో సాగింది. కాశీనాథ్ బయటకు వచ్చి తిన్నగా కచేరీకి వెళ్ళాడు. చాలా కాలం తరువాత చిన్న జమిందారు గారిని చూడగానే ఉద్యోగులు, నౌకర్లు అందరూ మర్యాదగా లేచి నిలబడ్డారు. దొరల డ్రస్సు వేసుకున్న ఒక యువకుడు మాత్రం లేవకుండా కూర్చొని తనపని చూచుకొంటున్నాడు. కొత్తగా వచ్చిన ఈ ఆగంతకుణ్ణి చూడగానే తమ ఆఫీసులోని వాళ్ళందరూ గౌరవ

సూచకంగా ఎందుకు నిలబడ్డారో ఆ యువకునికి అర్థం కాలేదు. కాశీనాథ్ ఒక కుర్చీ లాక్కొని కూర్చున్నాడు. ఆ యువకుడు కొత్తగా వచ్చిన మేనేజరు విజయకిశోరదాసు. కలకత్తాలో బి. ఎ. పాసయ్యాడు. మనిషి చాలా గట్టివాడు, అందుకనే వకీలు వినోదబాబు అతనిని మేనేజరుగా నియమించాడు. చాలా సేపటి తరువాత కొత్త మేనేజరు కాశీనాథ్‌తో "మీ రే దైనా పని ఉండి వచ్చారా ?" అని అడిగాడు.

" లేదు, పనేమీ లేదు, ఎలా పనిచేస్తున్నారో చూచి వెళదామని వచ్చాను."

దివానుగారు మధ్యలో కల్పించుకొని "వీరు మన జమిం దారు గారి అల్లుడు" అని పరిచయం చేశారు.

విజయబాబు కుర్చీలోనుంచి లేచి ప్రేమగా మాట్లా డటం ప్రారంభించాడు. ఇంతలో ఒక నౌకరు వచ్చి విజయ బాబుతో "మిమ్మల్ని అమ్మగారు ఒకసారి వచ్చి వెళ్ళ మన్నారు" అని చెప్పాడు.

విజయబాబు వెళ్ళిపోయిన తరువాత కాశీనాథ్ ఆశ్చర్య పడుతూ "వీరెవరు ?" అని అడిగాడు.

" కొత్త మేనేజరుగారు."

" ఎవరు నియమించారు ?"

" అమ్మాయిగారు."

" ఎందుకు ?"

" పనులు సరిగా సాగటం లేదనే ఉద్దేశ్యంతో నియమించారేమో !"

" ఇప్పుడు ఎక్కడికి వెళ్ళారు ?"

" అంతఃపురంలోకి."

కాశీనాథ్ మరేమీ అడగదలుచుకోలేదు. మెదలకుండా లేచి లోనికి వెళ్ళిపోయాడు. అతడు గదిలోకి వెళ్ళేసరికి తెర ఎదుట విజయబాబు నిలబడి ఉన్నాడు, తెరచాటు నుండి ఒక స్త్రీ మాట్లాడుతూ ఉంది. ఎవర్ని గురించి మాట్లాడుతున్నారో కాశీనాథ్ ఇట్టే గ్రహించగలిగాడు. కాని అదేమీ గమనించకుండా ముందుకు వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం మళ్ళీ అతనికి కమల కలిసింది. కమల అత్యంత గంభీరంగా " ఆరోగ్యం బాగుందా ?" అని అడిగింది. కాశీనాథ్ అవునని తలూపుతూ "బాగానే ఉంది అని జవాబు చెప్పాడు.

కమల తరువాత ఏమీ మాట్లాడ లేదు, మెదలకుండా వెళ్ళిపోయింది. ఆమెకు ఇప్పుడు కబుర్లు చెప్తుతూ కూర్చునే అవకాశం ఎక్కడిది, లక్షపనులున్నాయి, ముఖ్యంగా జమిందారీ వ్యవహారాలన్నీ నెత్తిన పడిన తరువాత మరీ క్షణం కూడా తీరిక లేకుండా ఉంది. ఒకనాడు కాశీనాథ్ ఉదయమే కొత్త

మేనేజరుకు కబురు పంపాడు. కొత్త మేనేజరు నౌకరు ద్వారా తనకు ప్రస్తుతం తీరిక లేదనీ, పనిపూర్తికాగానే వస్తానని చెప్పి పంపాడు. ఆ జవాబు విని కాశీనాథ్ తానే బయలుదేరి కచేరీకి వెళ్లాడు, మేనేజరును ఏకాంతంగా పిలిచి ఇలా అన్నాడు— "మీకు వచ్చే తీరిక లేదని నేనే వచ్చాను; నాకు అయిదు వందలు రూపాయలు కావాలి, మీకు తీరికకాగానే పంపండి."

"మీకు డబ్బెందుకు ?"

"అది తెలుసుకోవలసిన అవసరం మీకు లేదు."

"నాకు అవసరం లేనిమాట నిజమే, కాని యజమానురాలి ఆజ్ఞ లేకుండా మీకు డబ్బెలా ఇవ్వగలుగుతాను ?"

పరిస్థితులు మారిపోయాయని కాశీనాథ్ గ్రహించాడు. "నేను చెపితేచాలు, మరొకరి ఆజ్ఞ అవసరం లేదనే నేను భావిస్తున్నాను" అన్నాడు.

విజయబాబు "అవసరం ఉంది. ఎవరికిబడితే వాళ్లకు డబ్బు ఇవ్వవద్దన్నారు" అని దృఢంగా చెప్పాడు.

కాశీనాథ్ వచ్చేశాడు. అతడు కమలతో "కొత్త మనిషిని తీసెయ్యి" అని చెప్పాడు.

"ఎవర్ని ?"

"కొత్త మేనేజర్ని."

"ఎందుకు, అతని అపరాధం ఏమిటి ?"

" నా పట్ల అతని ఆచరణ సవ్యంగా లేదు."

" ఏం చేశాడు ?"

" నేను అతనిని ఒకసారి రమ్మని కబురుచేశాను, 'నా కిప్పుడు తీరిక లేదు, తీరిక చిక్కగానే వస్తానని' అతడు నాకు మళ్ళీ కబురు చేశాడు."

కమల నవ్వుతూ "తీరిక లేనిమాట నిజమే కావచ్చు. అలాంటప్పుడు ఎలా రాగలుగుతాడు?" అని అంది.

కాశీనాథ్ భార్యవైపు చూస్తూ ఇలా అన్నాడు— "తొందర పని ఉండి తీరిక లేక రాలేదనే అనుకుందాము. కాని నేను స్వయంగా అతని వద్దకు వెళ్ళి డబ్బు అడిగితే యజమాని ఆజ్ఞ లేకుండా ఇవ్వనని ఎందుకు అన్నాడు ?"

కమల మొదటి మాదిరిగానే చిరునవ్వు నవ్వుతూ "ఎంత డబ్బు కావాలని అడిగారు ?" అని అడిగింది.

" అయిదువందలు."

" ఇవ్వలేదా ?"

" లేదు. నువ్వు వద్దని చెప్పావా ?"

" అవును, ఆ విధంగా డబ్బు పాడుచేయటం నాకు ఇష్టం లేదు."

కాశీనాథ్ పాషాణం వంటి కాశీనాథ్ అయినప్పటికీ అతనికి మనసులో చాలా బాధ కలిగించె. తనపట్ల ఇలాంటి

ప్రవర్తనను అతడు ఇంతకు ముందెప్పుడూ చూడలేదు. అత్యంత వ్యాకులచిత్తముతో "నాకు డబ్బివ్వటము పాడుచేయుట మేనా?" అని అడిగాడు.

"ఏదైనా అనండి, ఖర్చుచేయుటమంటే పాడు చేయుటమే గదా?"

"అవసరమయినప్పుడు ఖర్చు చేయటము పాడు చేయటం కాదు."

"ఇంతకూ మీకు అంత అవసరం ఏమొచ్చింది?"

"ఒకరికి ఇవ్వాలి."

"ఇవ్వాలి నిజమే, ఎక్కడినుంచి వస్తుంది? మీ వద్ద ఉంటే ఇవ్వండి. నేను కాదనను."

కాశీనాథ్ ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆ మాటలు శూలములవలె గుచ్చుకున్నాయి. బయటకు వచ్చి తన గడియారము, ఉంగరము అమ్మి ఆ డబ్బును వైద్యనాథ్ పంపించాడు. ఇక తానేమీ డబ్బుపంపలేనని, డబ్బుకోసం తనకిక వ్రాయవద్దనీ బిందుకు ఉత్తరం వ్రాశాడు.

ఆనాటి నుండి కాశీనాథ్ లోనికి వెళ్ళటంలేదు. కమల కూడ ఏమీ అడగటంలేదు. ఆ విధంగా చాలా రోజులు గడిచింది. ఒకనాడు నౌకరువచ్చి కాశీనాథ్ "మీ కోసం ఎవరో బ్రాహ్మణుడు వచ్చాడు" అని చెప్పాడు.

మరు క్షణం లోనే కాశీనాథ్ తన ఎదుట నిలబడి వృద్ధ బ్రాహ్మణుని వైపు ఆశ్చర్యంగా చూచాడు. వృద్ధ బ్రాహ్మణుడు ఒక క్షణ కాలం మౌనంగా నిలబడి "తమరు చాలా గొప్పవారు, ధర్మాత్ములు, ఈ పేద బ్రాహ్మణునుకి అన్యాయం చేయకండి" అన్నాడు.

కాశీనాథ్ భయపడుతూ "ఏమిటి విషయం ?" అని అడిగాడు.

" అయ్యా, భగవంతుని దయవల్ల మీకు ఏ వెలితీ లేదు, అన్నీ ఉన్నాయి. నాకు ఆ కొద్దిపాటి పొలం తప్ప వేరే ఆధారం లేదు. దానిని మీరు లాక్కొని నాకు అన్యాయం చేయవద్దు" అంటూ ఆ బ్రాహ్మణుడు ఏడ్వసాగాడు.

వ్యాకులతతో కాశీనాథ్ ఆ బ్రాహ్మణుని చెయ్యి పట్టుకొని తన ప్రక్కనే కూర్చోబెడుతూ ఇలా అన్నాడు— " అసలు విషయమేమిటో వివరంగా చెప్పండి."

బ్రాహ్మణుడు అతి వినయంగా ప్రాధేయపడుతూ ఇలా అన్నాడు— "మీరు ధర్మప్రభువులు, క్షేత్రపాల భూమి నాది కాదని మీరు ప్రమాణం చేసి చెప్పండి."

" మీది కాదని ఎవరన్నారు ?"

" మీ క్రొత్త మేనేజరు విజయబాబు నాకు వ్యతిరేకంగా దావా ఎందుకు వేశారు ?"

" దావానా! నాకేమీ తెలియదే ?"

సమను చూపిస్తూ వృద్ధ బ్రాహ్మణుడు ఇలా అన్నాడు — "ఎలాగో దావా వేశారు కనుక ఆసాంతం నేనూ నిలబడతాను. మీరు నా పక్షాన ఉండాలి. నేను పేద వాడినే కావచ్చు, మీతో ఎదురు నిల్చి పోట్లాడటం మర్యాదగా ఉండక పోవచ్చు, అయినా, అంతమాత్రాన చూస్తూచూస్తూ నా పొలాన్ని వదులుకోను."

బ్రాహ్మణుడు కోపంగా లేచి వెళ్ళబోవటం చూచి కాశీనాథ్ అతని చెయ్యిపట్టుకొని కూర్చోబెడుతూ " నేను మీకు మేలు జరిగేట్లు నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. ఇక తరువాత మీయిష్టం, మీకెలా అనుకుంటే అలా చేయండి" అని అన్నాడు.

బ్రాహ్మణుడు వెళ్ళిపోయిన తరువాత కాశీనాథ్ విజయ బాబును పిలిచి " ఆ పొలం మనది కానుగదా! అలాంటప్పుడు అనవసరంగా ఆ బ్రాహ్మణుణ్ణి బాధ పెట్టటం ఎందుకు ?" అని అడిగాడు.

" యజమానురాలి ఆజ్ఞ."

కాశీనాథ్ కోపంగా " మీ యజమానురాలు ఇతరుల వాటిని కాజేయుమనే చెప్పుతుందా ?" అన్నాడు.

" అది మనదే."

"నేను అంగీకరించను, అది మనదికాదు."

కొద్ది క్షణాలు విజయబాబు మౌనం వహించి "నాదేముంది ? నేను ఉద్యోగిని. చెప్పిన పని చేయటమే నా విధి" అన్నాడు.

కమలతో ఈ విషయాన్ని గురించి మాట్లాడటానికి కాశీనాథ్‌కు చాలా సిగ్గుగా ఉంది. అయినా అతడు దృఢ నిశ్చయంతో ఆమె దగ్గరకు వెళ్లి "ఆ పొలం మనది కాదు. ఆ బ్రాహ్మణునికి అన్యాయం చేయవద్దు" అని చెప్పాడు.

"నేను అన్యాయం చేస్తున్నానని ఎవరు చెప్పారు?"

"ఎవరు చెపితేనేం, ఆ పొలం నీది కాదు. విజయబాబుతో అబద్ధపు దావా వేయవద్దని చెప్పు."

కమల అయిష్టతతో ఇలా అంది—"అది విజయబాబు అభిప్రాయం. వారి బాధ్యత ఏమిటో వారికి బాగా తెలుసు. మీరు అతని పనుల్లో కలిగించుకోనటం మంచిది కాదనే నేను అనుకుంటున్నాను."

కొంత కాలానికి దావా విచారణకు వచ్చింది. బోనెక్కి—కాశీనాథ్ ఇలా సాక్ష్యం చెప్పాడు— "చనిపోయిన ప్రియనాథబాబు కాలం నుంచి నేను జమిందారీ వ్యవహారాలు చూస్తూ వచ్చాను. వారు చనిపోయిన తరువాత కూడ చాలా కాలం వరకు నేనే జమిందారీ వ్యవహారాలన్నీ చూచాను.

ఆ పొలము కమలాదేవికి చెందదని నాకు పూర్తిగా తెలుసు.''

కేసు ఓడిపోయి విజయబాబు నీరసంగా ఇంటికి తిరిగి వచ్చాడు. బ్రాహ్మణుడు కాశీనాథ్‌ను ఆశీర్వదిస్తూ ఇంటికి వెళ్ళాడు.

# 9

తెర ఎదుట నిలబడి విజయబాబు దావాకు సంబంధించిన వివరాలన్నీ చెప్పి చిన్నబాబుగారి వల్లనే మనం ఓడిపోయాము అని వ్యాఖ్యానించాడు. ఆ మాట విని తెర వెనుక ఉన్న కమలకు పదింతలు కోపం వచ్చింది. చాలా సేపటి తరువాత ఆమె " మీరొక సారి లోనికి రండి, కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి'' అని అంది విజయబాబుతో. యజమానురాలి ఆదేశాన్ననుసరించి విజయబాబు లోనికి వెళ్ళాడు. చాలాసేపు ఇద్దరూ ఏదో నెమ్మదిగా మాట్లాడుకున్నారు. తరువాత విజయబాబు లేచి బయటకు వచ్చేశాడు.

చాలా కాలానికి ఇవాళ కమల భోజన సమయంలో కాశీనాథ్ దగ్గరకు వచ్చి కూర్చొంది. అంతకు ముందున్నంత

కోపంగా లేదిప్పుడు, ఆమె చాలా శాంతంగానూ, గంభీరం గానూ ఉంది. కొద్ది క్షణాల అనంతరం మౌనభంగం కలిగిస్తూ " ఇంటి గుట్టు బయటబెట్టిన విభీషణుని వల్ల బంగారంలాంటి లంకాపట్టణం నాశనమై పోయింది, ఆ సంగతి మీకు తెలుసు గదూ ?'' అని అడిగింది.

కాశీనాథ్ భోజనం చేస్తూ " అవును, తెలుసు '' అని జవాబు చెప్పాడు.

కమల చెప్పుతూ "మీకు తెలియని దేముంది. అతడూ ఇతరుల తిండి తినే బ్రతికాడు'' అని అంది.

కాశీనాథ్ ఏమీ మాట్లాడలేదు.

కొద్ది క్షణాలు మౌనంగా ఉండి కమల తిరిగి ఇలా అంది—" ఇతరుల ఉప్పుపులుసు తిని జీవించే మనిషి, అలా లేకుండా తానుగా బ్రతకలేని మనిషికి నిజమే మాట్లాడాలనే అహంకారం ఎందుకో ?''

కాశీనాథ్ అందుకేమీ జవాబు చెప్పకుండా తలవంచు కొని భోజనం చేయసాగాడు.

చెప్పుతూ కమల మళ్ళీ ఇలా అంది— " కసాయివాడు కూడ తాను ఎవరి అన్నపానీయాలతో జీవిస్తున్నాడో వాళ్ళ మీద కత్తి ఎత్తటానికి సంకోచిస్తాడు.

" కమలా !''

" భార్యసొమ్ము తిని బ్రతికే మనిషికి ఇంత కోపం బాగుండదు. రోజురోజుకు మరీ మీ వ్యవహారాలు చూస్తూ ఉంటే............"

కాశీనాథ్ నవ్వి "ఇంట్లోంచి గెంటి వేయాలని పిస్తుందా ? నువ్వు అనదలచింది అదేనా ?" అన్నాడు.

" అవును, అంతే."

సగం తిన్న అన్నపు పళ్లెమును ప్రక్కకు త్రోసి కాశీనాథ్ కమల ముఖం లోకి నిశితంగా చూస్తూ ఇలా అన్నాడు —" కమలా, నీమీద నేనెప్పుడూ కోపగించుకో లేదు, నిన్నెప్పుడూ కఠినంగానూ మాట్లాడ లేదు. ఇవాళ నువ్వు అంటున్న మాటలు ఇంతకు ముందెప్పుడూ నన్నెవరూ అని ఉండరు. ఇవాల్టినుంచి ,నేను నీ సొమ్ము తినను. దానివల్ల నీకు సంతోషం కలుగ వచ్చు." ఈ మాట అంటూ కాశీనాథ్ భోజనం ముందు నుంచి లేచి నిలబడ్డాడు. కమల కూడ గర్వంగా లేచి నిలబడి " నువ్వు అంత సత్యవాదివైతే ఈ మాట మర్చి పోకండి" అని అంది.

" మర్చిపోను, కాని నువ్వీ రోజున మాట్లాడిన మాటలే ఒకనాటికి నీకు శత్రువు లవుతాయి. నేనైతే నిన్ను క్షమించాను కాని భగవంతుడు నిన్ను క్షమిస్తాడా ?"

కమల మరింత రెచ్చిపోయింది— " మీ శాపనార్థాల వల్ల నాకు జరిగే అపకార మేమీ ఉండదు."

"నేను కోరేదీ అదే, నేను నీకు శాపనార్థం పెట్టలేదు, అది ఆ భగవంతుడికి తెలుసు. సుబుద్ధి గలిగి సుఖంగా ఉండమని నిన్ను ఆశీర్వదిస్తున్నాను."

బయటకు వచ్చేసి కాశీనాథ్ వ్యాకరణము, తత్వ శాస్త్ర గ్రంథాలు, అన్నీ ఒక్కొక్కటే చించి పారేశాడు. తనవద్దవున్న వస్తువుల్ని నౌకర్లకు పంచి పెట్టాడు. ఆ నాటి రాత్రి కమల గది ముందుకు వెళ్ళి తలుపు తట్టి "కమలా!" అని పిలిచాడు.

కమల మేల్కొనే ఉంది, కాని బదులు చెప్పకుండా పడుకుంది. తలుపు తెరిచే ఉంది, తలుపు తోసుకొని కాశీనాథ్ లోనికి వెళ్ళాడు. కమల కళ్ళుమూసుకొని మంచం మీద పడుకొని ఉంది. దగ్గర కూర్చొని అతడు ఆమె ఫాలభాగాన్ని నిమురుతూ "కమలా!" అని పిలిచాడు. అప్పటికీ జవాబు రాలేదు. చివరికి అతడు లేచి వెళ్ళిపోతూ "వెళ్ళిపోతున్న సమయంలో నిన్ను ఆశీర్వదించి వెళుతున్నాను" అని అన్నాడు.

కాశీనాథ్ బయటకు వెళ్ళిపోగానే కమల లేచి కిటికీ వద్దకు వచ్చి కూర్చుంది. తెల్లవారబోతున్న సమయంలో లేచి వచ్చి మంచం మీద పడుకుంది, అలాగే నిద్ర పోయింది. మెలకువ వచ్చి లేచి చూచేసరికి చాలా ప్రొద్దెక్కింది, ఇంట్లో ఏదో గోలగా ఉంది. ఆమె నిద్రలేచిందో లేదో ఒక దాసి

గబగబ అక్కడికి వచ్చి "అమ్మగారూ, చాలా ఘోరం జరిగింది, బాబుగారిని ఎవరో చంపేశారు" అని చెప్పింది.

సలసల కాగుతున్న నూనె బాండీ మీద పడితే గిలగిల తన్నుకున్నట్లు కమల విలవిల తన్నుకునే హృదయంతో గబగబ క్రిందికి దిగివచ్చింది—"ఏమిటి ? చంపేశారా?" అని అడిగింది కంగారు పడుతూ.

"అవునమ్మా, అంతే జరిగింది" అని చెప్పింది దాసీ.

వెంటనే కమల ఉన్నపళంగా ముందు గదిలోకి వచ్చింది, రక్తంలో పూర్తిగా తడిసిపోయిన కాశీనాథ్ శరీరం ఎదురుగా సోఫాలో కన్పించింది. అతని శరీరమంతటా రక్తము మట్టి కలిసి గడ్డకట్టుకు పోయింది. నోట్లోనుంచి, ముక్కుల్లో నుంచి, చెవుల్లోనుంచి కారిన రక్తము ఎక్కడికక్కడ ఎండి పోయింది. కమల ఆ దృశ్యాన్ని చూచి బిగ్గరగా అరచి స్పృహ తప్పి పడిపోయింది.

జమిందారుగారి అల్లుడు రాత్రి ఒంటరిగా ఎక్కడికో వెళుతూ ఉంటే ఎవరో హత్య చేశారనే వార్త ఊరంతా పాకింది.

రెండు రోజులకు కాశీనాథ్ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు, కళ్ళు తెరవగానే ఎదురుగా నిలబడి ఉన్న పోలీసు ఇన్స్పెక్టరు" బాబుగారూ, మిమ్మల్ని హత్య చేయటానికి ప్రయత్నించిన వాళ్ళెవరు ? " అని ప్రశ్నించాడు.

కాశీనాథ్ పైకేసి చూపిస్తూ "ఆ భగవంతుడు!" అని జవాబు చెప్పాడు.

జమిందారు గారి వృద్ధసేవకులు కూడ అక్కడే ఉన్నారు, కాశీనాథ్‌ను చూచి వాళ్ళు కంటతడి పెట్టుకున్నారు.

"మీరు వాళ్ళను గుర్తించ లేదా?" అని మళ్ళీ ఇనస్పెక్టరు ప్రశ్నించాడు.

"గుర్తించాను" అని కాశీనాథ్ మెల్లగా గొణిగాడు.

"అయితే, ఎవరు వాళ్లు?" అని ఇనస్పెక్టరు చాలా ఆదుర్దాగా అడిగాడు.

కాశీనాథ్ భయపడుతూ "నేను చెప్పింది అబద్ధం. నేను వాళ్ళను గుర్తుపట్టలేదు" అన్నాడు.

ఇనస్పెక్టరు మళ్ళీమళ్ళీ ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. కాశీనాథ్ తరువాత ఒక్కమాట కూడ చెప్పలేదు. మర్నాడు కాశీనాథ్ ఒక వృద్ధసేవకుణ్ణి పిలిచి "వైద్యనాథ్‌లో నా చెల్లెలు బిందువాసిని ఉంది. ఎవరైనా పంపి ఆమెను ఒకసారి పిలిపించండి. చూడాలని ఉంది" అని చెప్పాడు.

మూడు రోజుల తరువాత బిందువాసిని యోగేశబాబు వచ్చారు. బిందు కొంచెం ధైర్యం గల స్త్రీ, కాశీనాథ్‌ను ఆ స్థితిలో చూచి ఆమె గాబరాపడనూ లేదు, స్పృహతప్పి

పడిపోనూలేదు, కన్నీరు తుడుచుకొని రుద్ధకంఠంతో "కాశీ అన్నా! ఇంత పనికి ఒడిగట్టిందెవరు ?" అని అడిగింది.

"నాకేం తెలుసు ?"

"ఎవరిమీదనైనా అనుమానం ఉందా ?"

"చెల్లీ, ఆమాటే అడగ వద్దు."

బిందు మెదలకుండా కాశీ ముఖంలోకి చూడసాగింది.

ఇంత పెద్ద దెబ్బలు తగిలిన తరువాత కాశీనాథ్ జీవించటం కష్టమనే అందరూ అనుకున్నారు. మృత్యువు కూడ దరిదాపులకు వచ్చింది. రాత్రి చాలా ప్రొద్దు పోయింది, జ్వర తీవ్రతలో విలవిలలాడుతూ "కమలా, ఈ పని చేయించింది నువ్వు కాదుగదా ?" అని అరిచాడు.

బిందు కాశీనాథ్ ముఖం మీదికి వంగి "అన్నా, ఏమిటి నువ్వనేది ?" అని అంది.

కాశీనాథ్ బిందువాసినిని కమల అనుకొని ఆమె మెడ చుట్టూ చేతులు వేసి "కమలా, మరణించినప్పటికీ నాకు సుఖం ఉండదు, నిజం చెప్పు, ఈ పని నీ ద్వారా జరగలేదా !" అన్నాడు.

# 10

స్పృహ వచ్చికూడా చైతన్యం లేకుండా, నిద్ర ఆవరించిన స్థితిలో కమల రెండు మూడు రోజులు అలాగే పడి ఉంది. డాక్టర్లు ఆమె విషయంలో కొంత భయపడ్డారు. అందు కని ఇంటిలోని వారందరూ ఆమె చుట్టూచేరి కూర్చున్నారు. రెండు రోజులు రాత్రింబవళ్లు అనేక విధాల శుశ్రూష చేయగా పూర్తిగా తేరుకొని కమల లేచి కూర్చుంది.

కమల కళ్లు తెరిచి చూచేసరికి ఒక అపరిచిత స్త్రీ ఎవరో తన తలను ఒడిలో పెట్టుకొని కూర్చుంది. తాను ఇంతకు ముందెప్పుడూ ఆమెను చూడలేదు. "మీరెవరు ?" అని అడిగింది ఆమె.

ఆ అపరిచిత స్త్రీ "నాపేరు బిందు, మీ భర్తగారి చెల్లెల్ని" అని జవాబు చెప్పింది.

చాలా సేపటి వరకు కమల మౌనంగా ఆమె ముఖం చూస్తూ ఉండి పోయింది. తరువాత గదిలో ఉన్న వారందరినీ బయటకు వెళ్ళమని చేతితో సైగ చేసింది. అందరూ బయటకు వెళ్ళిపోయారు, కమల బిందువైపు చూస్తూ "ఆడబిడ్డగారూ, నేను ఎప్పటి నుండి ఇలా పడి ఉన్నాను ?" అని అడిగింది.

" వదినగారూ, మొన్న ఉదయం మీరు స్పృహ తప్పి పడి పోయారు, అప్పటి నుంచి మీకు తెలివి రానే లేదు " అని చెప్పింది బిందు.

" మొన్నా !" అంటూ త్రుళ్ళిపడింది కమల. తరువాత మెదలకుండా తలవంచుకొని కూర్చుంది. ఆమెలో ఏమీ చలనం లేకపోయేసరికి బిందు ఆమె కుడి చేతిని పట్టుకొని " వదినా !" అని పలకరించింది.

కమల తలవంచుకొని కూర్చుంది, జవాబేమీ చెప్పలేదు. తరువాత " ఆడబిడ్డగారూ, మీరిక భయపడకండి, మళ్లీ అలా స్పృహతప్పి పడిపోను " అని అంది.

తెలివి తప్పి పోకుండా ఉండటానికి కమల లోలోపల ఎంతో ప్రయత్నిస్తున్నట్లు బిందు గ్రహించింది. అందుకని ధైర్యం వహించి ఆమె మెదలకుండా కూర్చుంది. ఈ విధంగా మరికొంతసేపు గడిచిన తరువాత కమల ఆమెతో మాట్లాడ సాగింది— "ఆడబిడ్డగారూ, మీరు రెండు రోజులనుంచి నావద్ద ఇలాగే కూర్చొని ఉండి పోయారన్నమాట, ఇంతకూ మీరు ఇంతగా నాకెందుకు సేవ చేస్తున్నారు ? నేను ఇంతవరకు ఎవరికీ ఏమీ సేవ చేయ లేదు."

బిందుకు ఆమె మాటలు సరిగ్గా అర్థం కాలేదు, అందుకు ఆమె ఇలా జవాబు చెప్పింది—" ఏం, నీకు సేవ చేయ కూడదా వదినా ? నువ్వేమైనా నాకు పరాయి

దానవా ? మనిద్దరికీ పరిచయం లేకపోవచ్చు, కాని నాకు కాశీ అన్న మాదిరే నువ్వూను. వారికి చేసినట్లే నీకుం సేవ చేయటం నా కర్తవ్యం. వదినా, నీకు తెలియను కాని నేను ఇక్కడ అడుగుపెట్టినప్పటి నుంచి కాలం ఎలా గడిచిందో ఆ భగవంతునికి తెలుసు. కొంతసేపు అన్న గదిలోనూ, కొంత సేపు నీ గదిలోనూ—అక్కడ ఉన్నప్పుడు నువ్వెలా ఉన్నావో నని మనసు పీకుతూ ఉండేది, నీ దగ్గర ఉంటే అన్నను గురించి మనసు ఆరాట పడేది. ఈ రెండు రోజులు నా పరిస్థితి అలా ఉంది. ఇవాళ సాయంత్రం నుంచి అన్నగారి ఆరోగ్యం కొంచెం బాగుపడింది. అన్నయ్య ఇప్పుడు హాయిగా నిద్రపోతున్నాడు గనుక నేను నిశ్చింతగా ఇక్కడికి వచ్చి కూర్చున్నాను. ఈ ఆపదనుంచి అన్నయ్య బ్రతికి బయట పడతాడని ఎవరూ అనుకోలేదు.''

" బ్రతికారా ?'' అని అడిగింది కమల వెంటనే.

" అవును, ఎందుకు బ్రతకడు ? మరేమీ ప్రమాదం లేదని డాక్టరుగారు చెప్పారు, జ్వరం కూడ చాలా వరకు జారి పోయింది.''

ఒక క్షణకాలం కమల ముఖం అకస్మాత్తుగా కాంతి వంతమయింది, కాని అంతలోనే ప్రాణం లేనట్లు వాడిపోయింది. నిలువెల్లా కంపించి పోయింది; మరుక్షణం లోనే స్పృహతప్పి చుట్ట చుట్టుకొని బిందు ఒడిలో వాలిపోయింది.

బిందు గాబరాపడలేదు, కేకలువేయలేదు, ఎవర్నీ పిలవనూ లేదు, ఆమె తలను ఒడిలో పెట్టుకొని నెమ్మదిగా విసరసాగింది. ఈ స్త్రీలో సహజంగానే ఎంత ధైర్యం ఉన్నదీ ఆమె భర్తకు జబ్బు చేసి నప్పుడే వెల్లడయింది. మృత్యుదేవత తన హస్తాలను భర్తమీదికి చాచినప్పుడు బిందు లేశమైనా చలించలేదు. ఇంతకూ ఆమె కమలకోసం ఎందుకింత ఆదుర్దా పడుతుంది. కొంత సేపటికి తెలివి వచ్చి తానెక్కడ ఉన్నానా అని చూచింది కమల. తరువాత బిందు ఒడిలో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆ కరుణ క్రందన నిగూఢమై, హృదయాలను కదల్చివేసేట్లుంది, ఆమె రోదనం ఎవరికీ విన్పించలేదు. బయట ప్రకృతి వాతావరణం నిశ్శబ్దంగా ఉంది, క్రమంగా చీకట్లు ఆవరించాయి. మినుకు మినుకు మనే దీపకాంతిలో గదిమధ్య కూర్చొని ఉన్న యువతులిద్దరిలో ప్రశాంతమగు ఒక యువతి ఒడిలో ముఖం దాచుకొని రెండో యువతి తన గాయపడ్డ హృదయంలోని ఆవేదననంతా గ్రుమ్మరిస్తోంది.

చివరికి కమల స్థిమితపడి తన భర్తను గురించి అనేక విషయాలు అడిగింది. కాని ఒకసారి వెళ్ళి అతనిని చూచి రావాలనే కోర్కెను మాత్రం కనబర్చలేక పోయింది. ఎంత ఆలోచించినా బిందు ఒక నిశ్చయానికి రాలేక పోయింది. సంపన్నుల ఇళ్ళలో శిక్షణ, సంస్కారాలు ఇలాగే ఉంటా

యేమోనని కూడ బిందు ఒకసారి ఆలోచించింది. సేవ, శుశ్రూష బాధ్యతలన్నీ దాసదాసీలకు అప్పగించి బయటి నుండే క్షేమం కనుక్కుంటారేమో ! అకస్మాత్తుగా కమల బిందువైపు చూస్తూ ఇలా అడిగింది— "ఆడబిడ్డగారూ, తెలిసివచ్చిన తరువాత మీ అన్నగారు నన్ను గురించి ఏమైనా అడిగారా ?"

"ఆఁ, అడిగారు" అని మాత్రమే చెప్పి వూరుకుంది బిందు. కమల గ్రహించింది, ఏమీ ప్రశ్నించకుండా వ్యాకుల చిత్తంతో బిందు ముఖంలోకి చూస్తూ ఉండి పోయింది.

కొద్ది క్షణాలు మౌనంగా ఉండి తరువాత బిందు ఇలా చెప్పింది— "తెలివిరాగానే అన్నయ్య నువ్వే అనుకొని నా మెడ చుట్టూ చేతులు వేసి 'కమలా, చచ్చిపోయి కూడ నాకు శాంతి లభించదు, ఇది నువ్వు చేయించినపనే అని ఒక్కసారి నీ నోటితో చెప్పు' అని బిగ్గరగా అడిగాడు."

కమల ఊపిరి బిగపట్టి "తరువాత ఏమన్నారు ? అని అడిగింది.

"దేనిని గురించి అడిగారో నాకేమీ తెలియదు వదినా ! జరిగింది అంతే" అని చెప్పింది బిందు.

"వారు తెలుసుకోగోరుతున్న దేమిటో నాకు తెలుసు" అని కమల లేచి సరిగ్గా కూర్చుంది.

బిందు కమల చేతిని పట్టుకొని ఇలా అంది— " నువ్వు అన్నగారి గదిలోకి వెళ్ళవద్దు వదినా !"

" ఏం, ఎందుకని వెళ్ళవద్దంటావు ?"

" డాక్టర్లు వద్దని చెప్పారు, నువ్వు వెళితే ఏదైనా అనర్థం జరుగుతుందేమో !"

" నాకు జరిగే నష్టాన్ని గురించి నాకంటె డాక్టర్లకు ఎక్కువేమి తెలుస్తుంది, నేను తప్పకుండా వెళతాను. నిద్ర లేచిన తరువాత వారేదయినా సంగతి తెలుసుకోదలిస్తే నేనే జవాబు చెప్పాలిగదా !" ఈ మాట అంటూ కమల భావావేశంలో బిందు చేతిని పట్టుకొని " నేను జీవితాంతం తలెత్తుకో లేను. ఒకసారి నన్ను వారివద్దకు తీసుకువెళ్లు " అని అంది.

తరువాత కమల తనలో తాను ఆలోచించుకో సాగింది — భగవంతుడా, నువ్వు నా సౌభాగ్యాన్ని కాపాడావు, ఇప్పుడిక సత్యాసత్యములను నిర్ణయించి మళ్ళీ నా సౌభాగ్యాన్ని దూరం చేయకు ప్రభూ ! ఇంకా శిక్ష పూర్తికానే లేదు, యథాతథంగానే ఉంది. నువ్వు విధించిన శిక్షను నేను నవ్వుతూ భరించ గలిగేట్లు అనుగ్రహించు ప్రభూ, నాకు మిగిలిన ఈ చిన్న ద్వారాన్ని కూడ మూసి వేసి నన్ను అనాథను చేయకు.

భర్తగదిలో అడుగుపెట్టగానే కమల ఆందోళన పడసాగింది. రెండు రోజుల నుండి ఉపవాసము వలన నీరసించిన శరీరం నిలబడలేక పోయింది, వెంటనే వెళ్లి భర్తపాదాలపై పడి పోయింది.

కాశీనాథునికి అప్పుడే మెలకువ వస్తూ ఉంది. ఎవరో వచ్చి తన పాదాల మీద పడినట్లు అర్థమయింది, కాని తల పయికెత్తి చూడలేక పోయాడు. అందుకని అతడు అలాగే పడుకొని ఉండే " ఎవరు, బిందూ ?" అన్నాడు.

" కాదు అన్నా, వదినగారు " అని బిందు జవాబు చెప్పింది.

" కమలా, ఇక్కడికి నువ్వెందుకు వచ్చావు ?"

తలవైపున కూర్చొని ఉన్న బిందు నవ్వుతూ " అన్నయ్యా, మనిషి సంభాళించుకోలేక నీ పాదాల మీద పడి పోయింది " అని చెప్పింది.

ఆ మాట విని కాశీనాథ్ మెదలకుండా వూరుకున్నాడు. బిందు తిరిగి మౌన భంగం కలిగిస్తూ " ఈ రాత్రికి వదినగారిని ఇక్కడకు రావద్దని నేను చెప్పాను. రెండు రోజుల్నుంచి అన్నపానీయాలు లేక బాగా నీరసించి ఇప్పుడిప్పుడే తెలివి వచ్చింది కనుక నిలబడ లేదని నాకు తెలిసే అలా అన్నాను " అని చెప్పింది.

భర్తయొక్క రెండు పాదాల మధ్య తల దాచుకొని కమల కన్నీరుమున్నీరుగా విలపించ సాగింది. చల్లని తన పాదాల మీద వెచ్చని కన్నీరు పడుతున్నట్లు కాశీనాథ్ పోల్చుకో గలిగాడు. అతడు మెల్లగా “ ఆమె ఇక్కడికి రాకుండా ఉండటమే మంచిది చెల్లీ!” అని అన్నాడు.

కమలను చూడగానే బిందుకు కూడ దుఃఖం ఆగలేదు. కళ్లు తుడుచుకుంటూ ఆమె ఇలా అంది— “ మంచిదే అన్నా, కాని అలాంటి మంచి ఎవరయినా చేయగలిగితే గదా! ఏదో విధంగా నువ్వు మళ్ళీ ఆరోగ్యవంతుడవై లేచి తిరగాలి, ఈ రెండు రోజులు వదినకు ఎలా గడిచిందో నాకు తెలుసు, ఆ భగవంతుడికి తెలుసు. వదినకు కూడ తెలియదు.”

భగవంతుని పేరు వినేసరికి కాశీనాథ్ కళ్లు మూసు కున్నాడు, ప్రపంచంలోని స్త్రీ పురుషులు అందరికీ ప్రభువగు ఆ అంతర్యామి చిరకాలంగా తన హృదయ పీఠంలో అధిష్ఠించి ఉన్నట్లే అనుభూతి కలిగింది అతనికి. ఒక క్షణకాలం అతడా ప్రశ్నను ప్రభు పాదాల ముందుంచి జవాబు కోసం నిరీక్షించాడు. కొంత సేపటికి అతడు కళ్లు తెరిచి “ కమలా, ఇక నా ప్రాణాలకేమీ భయం లేదు, లేచిరా” అని అన్నాడు.

" అన్నా, నువ్వు నన్ను అడిగినదానికి జవాబు చెప్పాలనే వదిన వచ్చింది " అని అంది బిందు.

నీరసంగా ఉన్న కాశీనాథ్ పెదవుల మీద చిరునవ్వు పొడసూపింది. అతడు సహజ భావంతో ఇలా అన్నాడు—" ఇప్పుడిక ఎవరూ ఏమీ చెప్పనవసరం లేదు బిందూ, రెండు రోజులు ఆమె స్పృహ లేకుండా ఉండటంలోనే నా ప్రశ్నకు జవాబు లభించింది " ఈ మాట అంటూ అతడు ఎడమ చేతి మీద ఆనుకొని లేచి కూర్చున్నాడు. కుడిచేతితో కమల గడ్డం పట్టుకొని " కమలా !" అంటూ ఆమె తల పయికెత్తటానికి ప్రయత్నించాడు.

కమల ఏమీ జవాబు చెప్పలేదు, మరింత గట్టిగా అతని పాదాల మధ్య ముఖం దాచుకొంది. ఆమె మరింత దుఃఖించ సాగింది.

బిందు గాబరాపడుతూ " అన్నయ్యా, నువ్వు లేవ వద్దు. డాక్టరుగారు లేవ వద్దన్నారు.................. " అని అంది.

కాశీనాథ్ మందహాసం చేస్తూ " చెల్లీ, డాక్టరు ఏమైనా చెప్పవచ్చు. కాని ఇక భయపడ వలసిన అవసరం లేదు. మృత్యుముఖం నుంచి మీరు నన్ను కాపాడారు " అని అన్నాడు.

కొద్ది క్షణాల తరువాత కాశీనాథ్ చిక్కబడిన కమల ముంగురులు సవరిస్తూ సవరిస్తూ అలసిపోయి నెమ్మదిగా పడుకున్నాడు.



సమాప్తం.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA105R [illegible] |
| పుస్తకం పేరు | కాశీనాథ్ |
| తారీఖు | 25/10/26 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pratel [illegible] |
| పేజీలు విడదీసినది | JT Login |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |